


# నేర్చుకొనుటకు పసితనం ప్రతిబంధకం కాదు

వంట చేయడం నేర్చుకొనుట పెద్దగా పెరుగ నేర్చుకొనుటలో ఒక విధానం మాత్రమే. పళ్లు, పనుచిగుళ్ల భద్రతపట్ల రోజూ శ్రద్ధ వహించవలసిన విషయం కూడ మీరు ఆమెకు బోధించాలి. ఆమె వృద్ధాంగన యైనపుడు, ఆమె పళ్లు అప్పటికీ చెక్కుచెదర కుండా, సహజంగా వుంటవి. మీ వివేకమును ఆమె సర్వదా స్మరించుకుంటూ, అసహ్యకరమైన దంతక్షయం మరియు నొప్పి, పనుచిగుళ్ల బాధల బారినుండి ఆమెను రక్షించినందుకు మీకు అభివందనాలు అర్పించుతుంది. మీ పిల్లలకు వారెప్పుడో నేర్చుకోదగిన అత్యుత్తమ అలవాట్లను ఈనాడే బోధించండి— ఫొర్‌హన్స్' టూత్‌పేస్టుతో రోజూ పళ్లు, పనుచిగుళ్లను తోముకుంటూ వుండుట. అమెరికా యందలి దంతవైద్యుడు ఆర్. జె. ఫొర్‌హన్‌చే నిర్మించబడిన ఫొర్‌హన్స్' టూత్ పేస్టు ఒక్కటే ఆరోగ్యవంతమైన గట్టి పనుచిగుళ్లు, మెరిసే తెల్లని పళ్లకు తగిన ప్రత్యేక ఓషధిపదార్థములు గలది. ఇప్పుడే ఈ మంచి తీర్మానం చేయండి: జీవితకాల మంతయూ అనుసరించే అలవాటును మీపిల్లలకు నేడే ప్రారంభించండి... అది రోజూ ఫొర్‌హన్స్' టూత్‌పేస్టును వాడుటయే. ఒక ఉచిత ప్రతి చిన్న రంగుల పుస్తకం "CARE OF THE TEETH AND GUMS" (ఇంగ్లీషులో) కోసం తపాలా ఖర్చుల నిమిత్తం 15 న.పై. తపాలా బిళ్లలను పంపండి. మెసర్స్' డెంటల్ ఎడ్వయిసరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం. 10031, బొంబాయి-1.

**COUPON**

Please send me a copy of the booklet
"CARE OF THE TEETH AND GUMS"

*Name* ..................................................

*Address* ..................................................

C. I ..................................................



# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

కేవలం విక్స్ వేపొరబ్ మాత్రమే
రొంప జమకూడే మూడుచోట్లా తక్షణం పనిచేస్తుంది...

# రాత్రికి రాత్రే రొంపను మాపుతుంది




విక్స్ వేపొరబ్ రెండు విధాల పని చేస్తుంది — రాత్రి అంతా కూడా — ముక్కులోనూ, గొంతుకలోనూ, ఛాతీలోనూ, పనిచేసి మీ రొంప బాధను తొలగిస్తుంది. మీరు సులువుగా గాలిపీల్చుటకు, హాయిగా నిద్రపోవుటకు తోడ్పడుతుంది.

రొంప తొలి చిహ్నాలు కనబడగానే, ముక్కు వెంబడి చీమిడి, కారడం గొంతుపుండూ, దగ్గూ, ఛాతీలో భారం, ఈ చిహ్నాలు కనబడగానే, విక్స్ వేపొరబ్ ఉపయోగించండి. కేవలం విక్స్ వేపొరబ్ మాత్రమే రొంప జమకూడే ఈ మూడు చోట్లా అంటే ముక్కు, గొంతుకా ఛాతీంలో వెంటనే పనిచేస్తుంది. రొంప బాధలను రాత్రికి రాత్రే దూరంచేస్తుంది. నిద్ర పోయే ముందు, విక్స్ వేపొరబ్‌ను, ముక్కు మీదా, గొంతుక మీదా, ఛాతీమీదా, వీపుమీదా బాగా రాయండి. వెంటనే మీకు, విక్స్ వేపొరబ్ చర్మాన్ని వెచ్చగా చేయడం కనబడుతుంది. అదే సమయంలో మీ శరీరపు వేడి విక్స్ వేపొరబ్‌ను సత్వరం ఔషధాల ఆవిరిగా మార్చి వేస్తుంది. ఈ ఆవిరిని మీరు రాత్రంతా ప్రతిసారి ఊపిరి పీల్చిన పుడల్లా లోనికి తీసుకొంటారు. ఈ అద్భుతమైన ద్వివిధ చర్య, మీరు నిద్ర పోతున్నంత సేపూ జరుగుతూనే వుంటుంది. రొంప హెచ్చుగా బాధపెట్టే, ముక్కు, గొంతుకా ఛాతీలలో ఉపశమనం కలుగజేస్తుంది. ఉదయానికల్లా మీ రొంప చాలావరకు తగ్గిపోతుంది, మీరు తిరిగి ఆరోగ్యంగా ఆనందంగా వుంటారు.

విక్స్ వేపొరబ్‌ను రొంపజమకూడే ఈ ప్రాంతాలలో ఉపయోగించండి.

| | | |
|---|---|---|
| వేపొరబ్‌ను ముక్కు మీద చుట్టూ రాయండి. | వేపొరబ్‌ను గొంతుక మీదా, ఛాతీమీదా మర్దనా చేయండి. | వేపొరబ్‌ను వీపు అంతటా రాయండి. |



పొదుపుగల ఇంటి సీసా



సాధారణపు సైజు సీసా



తక్కువ ఖరీదుగల చిన్న డబ్బా

# విక్స్ వేపొరబ్

కుటుంబానికి చాలా మంచిది — పురుషులకు, స్త్రీలకు, పిల్లలకు

టినోపాల్ అదనపు తెలుపు వల్ల

# మీ చీరలు మెరుస్తయ్యి




మీరు వుతికే తెల్ల బట్టలకు టినోపాల్ చేర్చితే ఎంత వ్యత్యాసమో చూడండి. ఎంత ప్రకాశమానమైన తెలుపో! ఎంత అద్భుతమైన కాంతియో! చీరలు, షరాయిలు, తలగడ గలేబులు, పిల్లల బట్టలు. టినోపాల్ అదనపు తెలుపువల్ల మీరు వుతికే తెల్ల బట్టలన్నియు మెరుస్తయ్యి

నేడే టినోపాల్ కొనండి—కొత్త 'పిల్ఫర్ ప్రూఫ్ ప్యాక్'లో గలదు! బాల్చీడు బట్టలకు టీ చెంచాలో నాలుగోవంతు మాత్రమే చాలు.

**కొంచెము టినోపాల్ తెల్లని దుస్తులను అన్నిటికన్న తెల్లగా చేయును.**




టినోపాల్ జె. ఆర్. గెయిగి ఎస్. ఎ. బాల్ స్విట్జర్లెండ్ వారి రిజిస్టరు చేయబడిన ట్రేడుమార్కు

భారతదేశంలో తయారు చేయువారు: సుహృద్ గెయిగి లి., వడి వాడి, బరోడా

సేల్సు ఆఫీసు: ఎక్స్‌ప్రెస్ బిల్డింగ్, చర్చిగేట్, బొంబాయి-1 బి. ఆర్.

Shilpi SGT 146 TEL




# బ్రిటానియా
# గోల్డెన్ పఫ్




బ్రిటానియా వారే ప్రత్యేకంగా తయారుచేసే యీ గోల్డెన్ పఫ్ బిస్కట్లు తాజాగా కరకరలాడుతూ వుండి పుష్టినిచ్చును. కాఫీ, టీ, త్రాగేటప్పుడు సేవించుటకు అనువైనవి. జామ్, వెన్న, జున్నులతో కూడ సేవించవచ్చును. రుచి చూడండి — నోట్లో కరిగిపోతాయి. నేడే కొనండి. కమ్మగా రుచిగా వుండే యీ తాజా బ్రిటానియా గోల్డెన్ పఫ్ బిస్కట్లను సేవించి ఆనందించండి.

## బ్రిటానియా
## బిస్కట్లు






JWTBC 5910 A




ఇప్పుడు అందరికీ దొరుకుతుంది

## తాజా, పరిమళమైన, ఉత్తమ టీ

# టాటా-ఫిన్లే టీ

*సాటిలేని టీ!*

టాటా-ఫిన్లే టీ అత్యుత్తమమైన టీ. ప్రపంచములో కెల్ల ప్రఖ్యాత ఉత్పాదకులుగా, ఉత్తమశ్రేణి టీ ఉత్పాదనలో ఫిన్లేవారు గడించిన అనుభవము, విజ్ఞానము జగద్విదితము. అంతేకాదు— ప్రజల అభిరుచుల కనుగుణంగా టీ రకాలను మిశ్రణ (బ్లెండింగ్) చేయుటలో వీరి నైపుణ్యము అద్వితీయము. టాటావారు ప్రజల అనుకూలతను తెలిసికొని విక్రయ వితరణ కార్యక్రమాలను నిర్వహించుటలో అనుభవజ్ఞులు. కలసి మెలసి టాటా-ఫిన్లే వారు పలురకముల పరిమళమైన, ఉత్తమమైన, తాజా టీని అందించగలరు. ఇందుకొరకు ఈ టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుచున్నారు.

*టాటా-ఫిన్లే టీ త్రాగండి;*
*ఆనందము అందుకోండి!*




ఈ క్రింది రకాలలోను, ప్యాకింగ్స్‌లోను టాటా-ఫిన్లే టీ దొరుకుతుంది:-
ప్రెస్టిజ్ డార్జిలింగ్—సుందరమైన టిన్
లలిత్—బంగారు రంగు ప్యాకెట్
మిలాప్—వెండి రంగు ప్యాకెట్
బహదూర్-నారింజ రంగు ప్యాకెట్
షాన్-నీలి రంగు ప్యాకెట్




BI-TFN-4-TEL

పాలయొక్క గుణములు గలిగిన...




క్యాడ్ బరీస్
మిల్క్ చాక్లెట్

మిఠాయిని మించినది... ఆహారము!

CFY-7-TEL

" సావు పుటక లేనిదమ్మ నేస్తమన్నదీ-
జనమ జనమ కది మరీ గట్టిపడుతదీ..!"

మధురమైన ప్రణయకథ - ఆత్రేయ, మహదేవన్‌ల గానసుధ




# మూగమనసులు

నిర్మాత సీ.సుందరం. దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు

శ్రీఫిలింస్ విడుదల

NVKR



# ప్రశ్నోత్తరాలు

1\. జి. ఎ. లింగప్ప, కోలార్ గోల్డ్ ఫీల్డ్స్

వాల్మీకి "రామాయణం" వ్రాసినది శ్రీరాముడు పుట్టక మునుపా లేక వెనుకా?

శ్రీరాముడు త్రేతాయుగంలో పుట్టినట్టయితే వాల్మీకి రామాయణం వ్రాసినది కలి యుగంలో గనుక వెనకేనని చెప్పాలి.

2\. ఎం. వసంతకుమారి, నిజామాబాదు

ఇప్పుడు "చందమామ" కార్యాలయంలో ఎంత మంది చిత్రకారులున్నారు?

ముగ్గురు—చిత్రా, శంకర్, వడ్డాది పాపయ్య.

3\. వై. సత్యనారాయణ, బోధన్

"భారత చరిత్ర"లో జరిగిన సంఘటనలను నెల, తేదీలతో సహా మాకు ఎలా అందీయ గల్గుచున్నారు?

ఆ వివరాలు చరిత్రలో లభ్యమవుతున్నవే.

4\. ఎం. రామకోటయ్య, అర్మలగిరి

"రాకాసిలోయ" ఎన్నడు పూర్తి అవుతుందండీ? ఈ కథను పుస్తక రూపంగా ప్రకటిస్తారా?

త్వరలోనే పూర్తి అవుతుంది. దానిని పుస్తక రూపంలో ప్రచురించే ప్రయత్నం ఇప్పట్లో లేదు.

5\. వి. ఎస్. శాస్త్రి, పెదగంజాం

శ్రీమదాంధ్ర మహాభారతము మొదలు పెట్టినది ఎప్పుడు?

"చందమామ"లో ప్రచురించినది కవిత్రయం రచించిన శ్రీమదాంధ్ర మహాభారతం కాదు; వ్యాస భారతం ఉన్నదున్నట్టుగానే ప్రచురించాం. దానిని 1952 జులై సంచికతో ప్రారంభించాం.

6. కె. సుందరబాబు, ఏలూరు

భూమి చుట్టూ ఉండే గాలి పొర దాటి పైకి వెళ్ళితే భూమి (పరి) భ్రమిస్తున్నట్టు కనబడుతుందా? లేక అంతరిక్షంలోకి ఎంత దూరం వెళ్ళాలి?

ఆకాశంలో ఏ ప్రాంతంలోనైనా మనం నిశ్చలంగా ఉండగలిగితే భూమి తిర గటం కనిపించవచ్చు, కాని అది సాధ్యంకాదు. అతి తక్కువ కదలిక గల చంద్రుడి లాటి గోళం పై నుండి టెలిస్కోపులతో భూమిని గమనించినట్టయితే అది తిరగటం స్పష్టంగా కనిపించవచ్చు.

7. కె. శ్రీనివాసులు నాయుడు, కడప

భూమి తనపై నున్న ఇంత భారాన్ని ఆకర్షిస్తుంది గదా, పైకి పోతున్న బెలూన్‌ను తన వైపెందుకు ఆకర్షించలేదు?

నీటి మీద తేలే కర్రలనూ, పడవలనూ, ఓడలనూ ఎందు కాకర్షించ లేదో అందుకే. వాటిని కూడా భూమి ఆకర్షిస్తుంది. కాని వాటి కన్న నీరును హెచ్చుగా ఆకర్షిస్తుంది. బెలూన్ గాలి కన్న తేలిక గనక గాలిని హెచ్చుగా ఆకర్షిస్తుంది.

8. అ. కోదండరామ, కూలిం (మలాయా)

ప్రపంచములో మొట్టమొదట పుట్టినది స్త్రీయా, పురుషుడా?

ఏదీ కాదు, జీవకణాలు. అవి విభజన ద్వారా తమ జాతులను పెంపొందించు కున్నాయి. తరువాత ప్రాణుల పరిణామంలో స్త్రీ, పురుష లైంగిక లక్షణాలు క్రమంగా ఏర్పడ్డాయి. ఆదిలో ఈ రెండు లక్షణాలూ ఒకే ప్రాణిలోనే ఉండేవి. క్రమంగా స్త్రీ ప్రాణులూ, పురుష ప్రాణులూ వేరయాయి. అందుచేత స్త్రీ పురుష విభేదం ఒకసారే వచ్చింది. ఒకటి ముందూ, ఒకటి వెనుక రాలేదు.

9. యు. రంగాచార్యులు, నెల్లూరు

కొన్నివేల కోట్ల సంవత్సరాల తరువాత చంద్రుడు భూమి మీద పడి పోయే ప్రమాదం ఉండవచ్చునని కొందరు శాస్త్రజ్ఞులు ఊహించారట. వారి ఊహకు సరైన ఆధార మేదైనా ఉందటండీ?

చంద్రుడు భూమి పైన పడిపోతుందని శాస్త్రజ్ఞులు ఊహించ లేదు. చంద్రుడు క్రమంగా భూమిని చేరవస్తాడు. వాటి మధ్య ఉండే పరస్పరాకర్షణ అపారంగా హెచ్చిపోతుంది. చంద్రుడు ఒక దూరంలోకి వచ్చే సరికి గురుత్వాకర్షణ బల ప్రభావం చేత చంద్రగోళం ఛిన్నాభిన్నమై పోయి, దాని శకలాలు భూమి చుట్టూ తిరుగుతూ ఉంటాయి. ఇదే శాస్త్రజ్ఞులు చేసిన ఊహ. దీనికి ఆధారం అని శని గ్రహం చుట్టూ ఉండే వలయాలను చెబుతున్నారు. అవి ఛిన్నాభిన్నమైన శని యొక్క చందమామలని శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

### Statement about ownership of CHANDAMAMA (Telugu)
### Rule 8 (Form IV), Newspapers (Central) Rules, 1956

| | | |
|---|---|---|
| 1. *Place of Publication* | : | 'CHANDAMAMA BUILDINGS' |
| | : | 2 & 3, Arcot Road, |
| | | Vadapalani, Madras-26 |
| 2. *Periodicity of Publication* | : | MONTHLY |
| | | 1st of each Calendar month |
| 3. *Printer's Name* | : | B. NAGI REDDI, |
| | | Managing Director, |
| | | The B. N. K. Press (Pvt.) Ltd. |
| *Nationality* | | INDIAN |
| *Address* | | *2 & 3, Arcot Road, Vadapalani, Madras-26* |
| 4. *Publisher's Name* | | B. VENUGOPAL REDDI, Managing Partner, |
| | | Sarada Binding Works |
| *Nationality* | | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 5. *Editor's Name* | : | CHAKRAPANI (A. V. Subba Rao) |
| *Nationality* | | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 6. *Name & Address of individuals* | : | SARADA BINDING WORKS : |
| *who own the paper* | : | PARTNERS, |
| | | 1. Sri B. Venugopal Reddi. |
| | | 2. Smt. B. Seshamma. |
| | | 3. Smt. B. Rajani Saraswathi. |
| | | 4. Smt. A. Jayalakshmi. |
| | | 5. Sri B. L. N. Prasad. |
| | | 6. Sri B. Viswanatha Reddi. |
| | | 7. Smt. K. Sarada, |
| | | 8. Sri. B. Venkatrama Reddi, *(Minor)* |

I, B. Venugopal Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**B. VENUGOPAL REDDI,**
*Signature of the Publisher*

*1st March, 1964*



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికలోని "రత్నవతి కథ" దశకుమార చరిత్రలోనిది. దీనిని దండి అనే మహా కవి సంస్కృత వచనంలో రచించాడు. "దండినః పదలాలిత్యం" అని ప్రసిద్ధంగా చెబుతారు. ఈయన దక్షిణ దేశంలో కంచిలో పల్లవ రాజుల వద్ద ఆస్థాన విద్వాంసుడుగా ఉన్నవాడు. విష్ణువర్ధనుడి ఆస్థానంలో ఉండిన భారవికి మనమడు. దండిని వ్యాస వాల్మీకులతో పోల్చారు. సాక్షాత్తూ సరస్వతీదేవే "కవిర్దండీ, కవిర్దండీ" అన్నదని కథ కూడా చెబుతారు.

సంపుటి 34 మార్చ్ 1964 సంచిక 3







# భారత చరిత్ర



ఢిల్లీ సామ్రాజ్యం నుంచి అన్ని ప్రాంతాల కన్న ముందుగా స్వతంత్రమైనది బెంగాలు. అది సంపన్నమైన దేశం, ఢిల్లీకి చాలా దూరాన ఉన్నది; అందుచేత దాని పాలకులు మొదటి నుంచీ కేంద్ర పరిపాలనను ధిక్కరిస్తూ వచ్చారు. సుల్తాను బల్బన్ అనంతరం బెంగాలు దాదాపు స్వతంత్రమయింది. దాన్ని ఘియాసుద్దీన్ తుఘ్లక్ తిరిగి స్వాధీనపరచుకుని, మూడు ప్రాంతాలుగా విభజించి, వాటికి లఖ్నౌతీ, సాత్‌గాంవ్, సోనార్‌గాంవ్‌లు రాజధానులుగా ఏర్పాటు చేశాడు. ఇలా చేసినా తిరుగుబాట్లు ఆగలేదు. 1336 అనంతరం ఫఖ్రుద్దీన్ అనే వాడు సోనార్‌గాంవ్‌కు రాజైనాడు. మరికొద్ది కాలానికి ఉత్తర బెంగాలులో అలాఉద్దీన్ ఆలీ షా అనే వాడు స్వాతంత్ర్యం ప్రకటించి, తన రాజధానిని లఖ్నౌతీ నుంచి పాండువాకు మార్చాడు. 1345 ప్రాంతంలో బెంగాలు రాష్ట్రమంతా షంసుద్దీన్ ఇలియాస్ షా పాలన కిందికి వచ్చేసింది. ఇతని కాలంలోనూ, ఇతని కొడుకైన సికందర్ షా కాలంలోనూ కూడా ఢిల్లీ సుల్తానులు బెంగాలును స్వాధీనపరచుకొన యత్నించి విఫలులైనారు. సికందర్ షా 36 ఏళ్ళు దివ్యంగా పరిపాలించి 1398 అక్టోబరులో చనిపోయాడు. ఇతని కొడుకు ఘియాసుద్దీన్ అజమ్ వద్దకు చీనా చక్రవర్తి ప్రతిపక్షి 1408 లో రాయబారం పంపాడు, ఇతను మరుసటి ఏడు తన రాయబారిని చీనాకు పంపాడు. ఇతను 17 ఏళ్ళు పాలించి 1410 లో పోయాడు. ఇతని కొడుకు హంజా షా నామ మాత్రపు రాజు. ఇతని స్థానంలో నిజంగా రాజ్యమేలిన వాడు రాజా గణేశ్ అనే బ్రాహ్మణ జమీందారు. గణేశ్ తన కొడుకు జదు (యదు) అనే వాణ్ణి సింహాసన మెక్కించాడు. అతను

## 30. ఢిల్లీ సామ్రాజ్య విచ్ఛిత్తి— బెంగాలు

ఇస్లాం మతం పుచ్చుకుని, జలాలుద్దీన్ ముహమ్మద్ షా అనే పేరుతో రాజ్యం చేశాడు. ఇతను 1431 లో పోయాడు. ఇతని కొడుకు షంసుద్దీన్ అహ్మద్ 1442 దాకా దుష్పరిపాలన చేసి కుట్రదారుల చేత హతుడయాడు. కుట్రదారుల మధ్య కీచులాటలలో బెంగాలు సింహాసనం తిరిగి ఇలియాస్ షా వంశీయుల పరమయింది ; నాసిరుద్దీన్ మహ్మూద్ అనే వాడు రాజయాడు.

నాసిరుద్దీన్ 17 ఏళ్ళపాటు శాంతియుతంగా పరిపాలించి 1460 లో పోయాడు. ఇతని కొడుకు రుక్నుద్దీన్ బార్బక్ షా వద్ద అనేకమంది అబిసీనియను బానిసలుండే వారు. వారిలో కొందరికి ఇతను పెద్ద పదవు లిచ్చాడు. ఇతను 1474 దాకానూ, ఇతని కొడుకు యూసుఫ్ షా 1481 దాకానూ పరిపాలించారు. యూసుఫ్ షా కొడుకు మందమతి అయినందున బెంగాలు సింహాసనం నాసిరుద్దీన్ మహ్మూద్ కొడుకైన ఫథ్‌షాకు సంక్రమించింది. అయితే అబిసీనియనులు ఒక కొజ్జావాడి నాయకత్వాన కుట్రచేసి ఇతన్ని చంపేశారు. కొజ్జావాడు బార్బక్ షా అనే పేరుతో రాజై, ఫథ్ షాకు విశ్వాసపాత్రుడైన ఇందీల్‌ఖాన్ అనే వాడి చేత హత్య చేయబడ్డాడు. ఇతను



1489 దాకా పాలించిన పిమ్మట ఫథ్ షా కొడుకు రెండవ మహ్మూద్ షా రాజైనాడు. కాని మరుసటి ఏడే సీదీబద్ర్ అనే అబిసీనియను అతన్ని హత్యచేసి, సింహాసనం కాజేసి మూడేళ్ళ చిల్లరకాలం క్రూరంగా పరిపాలించాడు. ఇతని మంత్రి అలాఉద్దీన్ హుసేన్ అనే వాడు చాలా యోగ్యుడు. రాజోద్యోగులు రాజును బందీని చేసి 1493 లో ఈ మంత్రికే పట్టం కట్టారు.

ఇతను అరబ్బువాడు. ఇతని సంతతి బెంగాలును సుమారు అర్థ శతాబ్దం పాటు పరిపాలించారు. వారిలో కొందరు ఉపయుక్తమైన పను లనేకం చేశారు. హుసేన్

షా అనేక శాసనాలు చెక్కించాడు. అతని నాణాలు విరివిగా దొరుకుతున్నాయి. ప్రజా రంజకులైన బెంగాలు ప్రభువులలో అత నొకడు. ఇతను బెంగాలు రాజ్యాన్ని దక్షిణాన ఒరిస్సా దాకా విస్తరింప జేశాడు. మగధదేశాన్ని జౌన్పూర్ పాలకుల నుంచి లాక్కున్నాడు. అసాములోని ఆహోమ్ రాజ్యం పై దాడి చేసి, కూచ్ బిహారులోని కామతాపురాన్ని 1498 లో పట్టుకున్నాడు. ఇతను 1518 లో చనిపోయాడు. ఇతని పెద్ద కొడుకు నసీబ్ ఖాన్ రాజ్యానికి వచ్చాడు. నుస్రత్ షా అనే పేరుతో రాజ్యమేలిన ఇతను కళనూ, శిల్పాన్నీ, సాహిత్యాన్నీ ప్రోత్సహించాడు. "బరాసోనా మసీద్", "కదమ్ రసూల్" అనే గొప్ప మసీదులను గౌర్ వద్ద నిర్మింప జేశాడు. మహాభారతాన్ని బెంగాలీ భాషలోకి అనువదింప జేశాడు. ఇతన్ని రాజభవనంలోని కొజ్జాలు 1533 లో హత్య చేశారు.

ఇతని అనంతరం ఇతని కొడుకు అలా ఉద్దీన్ ఫీరూజ్ షా రాజై, మూడు నెలలు మాత్రమే రాజ్యం చేసి, తన పినతండ్రి అయిన ఘియాసుద్దీన్ మహ్మూద్ షా చేత హత్య చేయబడ్డాడు. ఈ మహ్మూద్ షా హుసేన్‌షా వంశానికి చెందిన ఆఖరు బెంగాలీ రాజు. ఇతన్ని షేర్‌ఖాన్ సూర్ అనే వాడు బెంగాలు నుండి వెళ్ళగొట్టేశాడు.

*జౌన్పూర్ :*

తీమూర్ దాడుల సమయంలో స్వతంత్రమైన జౌన్పూర్ రాజ్యం బుహ్లూల్ లోదీ కాలంలో తిరిగి ఢిల్లీ సామ్రాజ్యంలో చేరిపోయింది. ఈ మధ్యకాలంలో ఈ రాజ్యాన్ని పరిపాలించిన వారిలో షర్కీ వంశపు రాజులు చరిత్ర ప్రసిద్ధులు. వీరు 85 ఏళ్ళు పరిపాలించారు. వారిలో ప్రఖ్యాతుడు ఇబ్రాహీం షా షర్కీ. ఇతను 1402 నుంచి సుమారు 34 ఏళ్ళు పాలించాడు. ఇతను విద్వాంసుడు, లలితకళా సాహిత్య ప్రియుడు.





# మహాభారతం

ద్వారకలో ముసలం పుట్టి యాదవవంశ క్షయం జరిగే నాటికి హస్తినాపురంలో ధర్మ రాజు పరిపాలన ముప్ఫయ్యారో ఏడు జరుగుతున్నది. ద్వారకలో కనిపించిన ఉత్పాతాల వంటివి హస్తినాపురంలోనూ కని పించాయి. గులకరాళ్ళు వర్షించాయి, ఉల్కలు తెగరాలాయి, సూర్య చంద్రులు మూడు రంగులలో కనిపించారు. ఇంత లోనే దారుకుడు కురుదేశాలకు వచ్చి, పాండవులకు జరిగిన దంతా చెప్పాడు.

కృష్ణుడితో సహా యాదవ వంశ మంతా నిర్మూలమయిందంటే పాండవులు నమ్మ లేకపోయారు. ఇప్పుడేమిటి కర్తవ్యమని ధర్మరాజు తన తమ్ముల నడిగాడు. అర్జు నుడు తాను ద్వారకకు వెళ్ళి తమ మేన మామ అయిన వసుదేవుణ్ణి చూసి వస్తానని చెప్పి, దారుకుడి వెంట రథంలో బయలు దేరి వెళ్ళాడు.

ద్వారకానగరం వైధవ్యం సంప్రాప్తిం చిన స్త్రీ లాగున్నది. అర్జునుణ్ణి చూడగానే అంతఃపుర స్త్రీలందరూ గొల్లున ఏడ్చారు. సత్యభామా, రుక్మిణీ అర్జునుడికి నమ స్కారం చేసి, కూర్చోమని ఆసనం చూపిం చారు, కాని వారేమీ అనలేకపోయారు. ఆ స్త్రీలను చూడటానికే అర్జునుడికి భయం వేసింది. అయినా అతను వారి నూరడించి, కృష్ణుడి గొప్పతనం గురించి కాస్సేపు మాట్లాడి, వసుదేవుడి వద్దకు వెళ్ళాడు.

వసుదేవుడు శోకంతో మంచం పట్టి ఉన్నాడు. అర్జునుడు వచ్చి తన కాళ్ళు పట్టుకోగానే ఆయన లేచి అర్జునుణ్ణి కౌగ లించుకుని, "నాయనా, అందరూ పోయారు. వారి చావు విని కూడా ఇంకా బతికే ఉన్నాను. నీకు సాత్యకి, ప్రద్యుమ్ను లంటే ఎంతో ప్రేమ; వారి మూలానే ఇంత మందీ నశించారు! కృష్ణుడి అభిమానులే

అట్ట చివరి బొమ్మ




ఈ పని చేశారు! యాదవులను కాపాడటానికి కృష్ణుడైనా ఏమీ ప్రయత్నించలేదు. ఒకరిననేదేమిటి? మునుల శాపం తగిలింది. ఇక నాకు జీవించాలని లేదు. ఆహారం మానేశాను. నీవు వస్తావనీ, నీ వెంట ద్వారకలో ఉన్నవారి నందరినీ పంపివేయమనీ, ఆ తరవాత ద్వారక సముద్రంలో మునిగిపోతుందనీ కృష్ణుడు నాతో చెప్పి ఎటో వెళ్ళిపోయాడు. కనక వాడు చెప్పిన ప్రకారం చెయ్యి," అన్నాడు.

అర్జునుడు మంత్రులతోనూ, బ్రాహ్మణుల తోనూ సభ చేసి, "స్త్రీ జనాన్ని ప్రయాణానికి సిద్ధం చేయించండి. యువరాజైన వజ్రుణ్ణి కూడా నా వెంట తీసుకుపోతాను. రత్నాలు మొదలైన వాటిని కూడా పోగు చెయ్యండి. ఇంక ఏడు రోజులకు ద్వారక సముద్రంలో మునుగుతుంది. అందరూ ప్రయాణాలుకండి. ఆలస్యం చెయ్యవద్దు," అని చెప్పాడు.

అర్జును డా రాత్రి అక్కడే గడిపాడు. మర్నాడు వసుదేవుడు యోగసమాధిలో ప్రాణాలు విడిచిపెట్టాడు. వసుదేవుడికి ప్రియమైన చోటనే ఆయనకు దహన క్రియలు జరిగాయి. ఆయనతోబాటు ఆయన భార్యలు దేవకీ, భద్రా, రోహిణీ, మదిరా సహ గమనం చేశారు. వజ్రుడు మొదలైన యాదవకుమారు లాయనకు జలతర్పణాలు విడిచారు.

తరవాత అర్జునుడు యాదవులు చచ్చిన ప్రదేశానికి వెళ్ళాడు. యుద్ధరంగంలోలాగా వారంతా చచ్చిపడి ఉన్నారు, మూడు పలకల తుంగ వారి ప్రాణాలు తీసింది. యాదవుల కందరికీ అర్జునుడు తగిన రీతిగా సంస్కారం చేయించి, మనుషుల చేత బలరామ కృష్ణుల కళేబరాలు వెతికి తెప్పించాడు. వాటికి కూడా దహన సంస్కారాదులు చేయించి, అర్జునుడు ఏడవ రోజున

హస్తినాపురానికి తిరుగు ప్రయాణం సాగించాడు. గుర్రాలూ, ఎద్దులూ, గాడిదలూ, ఒంటెలూ కట్టిన రథాలు బయలుదేరాయి. యాదవస్త్రీలు అర్జునుడి వెంట కదిలారు. వృద్ధులూ, పిల్లలూ ఒక గుంపుగా నడిచారు. పౌరులందరినీ వెంటబెట్టుకుని అర్జునుడు వెళ్ళిపోతూ ఉంటే, అతని వెనకగా ద్వారకను ముంచుకుంటూ సముద్రం కూడా వచ్చింది.

ఆ రోజు దాకా ద్వారకలోనే ఉండిన వారికీ దృశ్యం అద్భుత మనిపించింది.

అందమైన వనాలూ, కొండలూ దాటుతూ, అర్జునుడు చెప్పిన చోటనల్లా ఆగుతూ, అందరూ ప్రయాణించి పంచనదం చేరారు. అక్కడ ఒక దొంగల దండు వారి పైన పడింది. వేల సంఖ్యలో కర్రలు పట్టుకున్న దొంగలు, రాళ్ళురువ్వుతూ వారి పైన బడ్డారు. ఆ ప్రయాణీకులలో యోధుడైన వాడు అర్జును డొక్కడేనన్న సంగతి వారు గమనించారు. అర్జునుడు వాళ్ళను వెళ్ళి పొమ్మనీ, వెళ్ళిపోకపోతే బాణాలతో కొట్టి చంపేస్తాననీ బెదిరించాడు. కాని వాళ్ళు లక్ష్యపెట్ట లేదు. అర్జునుడు గాండీవాన్ని ఎక్కుపెట్ట యత్నించాడు. ఆ పని చాలా కష్టమనిపించింది. ఎలాగో బాణం ఎక్కు



పెట్టి అస్త్రాలను స్మరించగా ఒక్కటీ జ్ఞాపకం రాలేదు. అతను తన అశక్తతకు సిగ్గుపడిపోతూ, మామూలు బాణాలతో కొందరు దొంగలను చంపాడు. కాని బాణాలు అయిపోయాయి. అర్జునుడు చూస్తుండగానే దొంగల ముఠా యాదవస్త్రీలను ఎత్తుకుని వెళ్ళిపోయారు.

ఈ విధంగా తీరని పరాభవం పొంది అర్జునుడు మిగిలిన యాదవులనూ, ధనాన్నీ వెంటబెట్టుకుని హస్తినాపురం చేరుకున్నాడు. ద్వారక నుంచి వచ్చినవారికి వేరువేరు స్థలాలలో నివాసాలు ఏర్పాటుచేశారు. కృతవర్మ

భార్యనూ, కొడుకునూ మార్తికావతంలో ఉంచారు. వజ్రుడికి ఇంద్రప్రస్థంలో పట్టాభిషేకం చేసి, అనేక మంది యాదవులకు అక్కడే నివాసాలు ఏర్పాటుచేశారు. సాత్యకి కొడుకును సరస్వతికి రాజును చేశారు. కృష్ణుని భార్యలలో రుక్మిణీ, జాంబవతీ, హైమవతీ మొదలైన అయిదుగురు అగ్ని ప్రవేశం చేశారు.

సత్యభామా, మిగిలిన వాళ్ళూ తపస్సు చేసుకోవటానికి హిమాలయాలు దాటి కలాప అనే గ్రామం చేరారు.

తన వెంట తెచ్చిన యాదవుల నందరినీ ఆయా స్థలాలలో ఉంచి అర్జునుడు వ్యాస మహాముని ఆశ్రమానికి వెళ్ళి, ఆయనకు తన పేరు చెప్పుకుని నమస్కారం చేశాడు. ఆయన అర్జునుణ్ణి క్షేమమడిగి, కూర్చోమని, అతని విషాదస్థితి గమనించి, అందుకు కారణమేమిటని అడిగాడు.

అర్జును డాయనతో, "మహాత్మా, కృష్ణ బలరాములు చనిపోయారు. యాదవు లందరూ ఒకరినొకరు హత్య చేసుకున్నారు. కృష్ణుడు లేకుండా నే నెలా బతకటం? అతను నా రథం నొగలు మీద కూర్చుని నా చేత యుద్ధం చేయించటం ఇంకా కళ్ళకు కట్టినట్టే ఉంది! అది అలా ఉండగా, నా శక్తి అంతా చచ్చింది. అస్త్రాలన్నీ పోయాయి. దొంగలు నా కళ్ళ ఎదట యాదవకాంతలను తీసుకుపోతూంటే ఏమీ చెయ్యలేని వాణ్ణయాను. ఇక నా కర్తవ్యం ఏమిటో సెలవియ్యండి!" అన్నాడు.

"నాయనా, కాలం ఇలాటి మార్పులు తెస్తుంది. కృష్ణుడు వచ్చిన పని అయిపోయింది. వెళ్ళిపోయాడు. నీ అస్త్రాలూ అలాగే పని ముగించి వెళ్ళిపోయాయి. మీరు కూడా ఉత్తమ గతి చేరటానికి సమయమయింది. అందుచేత నీవు చింతించవలిసిన పనిలేదు," అని వ్యాసుడు అర్జునుడికి కాలప్రభావం గురించి బోధించి పంపేశాడు. అర్జునుడు హస్తినాపురానికి తిరిగి వచ్చాడు.






## 33

[ కేశవుడూ అతడి అనుచరుల్నీ, గణాచారి ముఠా వాళ్ళు పట్టుకో చూశారు. కాని, వాళ్ళు రాత్రివేళ వాళ్ళ కనుగప్పి, కొండశిఖరం చేరారు. అవతల, వాళ్ళకు ఒక భయంకరమైన లోయ కనిపించింది. వాళ్ళు అడవి తీగ నొక దాన్ని పట్టుకుని లోయలోకి దిగుతున్నంతలో, గణాచారి ముఠా వాళ్ళు వచ్చి, రాళ్ళతో తీగను నరికి వేయసాగారు. —తరవాత ]

తమకు ఆధారంగా వున్న అడవి తీగను గణాచారి ముఠా వాళ్ళు పైన నరికివేస్తున్న శబ్దం వింటూనే, కేశవుడితో పాటు జయమల్లూ, కోయగోమాంగ్ కూడా భయంతో కంపించి పోయారు. కాని, మరుక్షణంలో వాళ్ళకు ఎక్కడలేని గుండెధైర్యం కలిగింది.

"ఇన్ని కష్టాలు దాటి, యింత దూరం వచ్చి, యిక్కడ చావబోతున్నామంటే నేను నమ్మను," అన్నాడు కేశవుడు నిండు కంఠంతో.

"నీ వన్నది నిజం, కేశవా! నా కాలికేదో పట్టు చిక్కింది. మీరు తీగ మీద నుంచి సాధ్యమైనంత బరువు తగ్గించి, చేతి పట్టు కేమైనా దొరుకుతుందేమో చూడండి. వీలయితే, మనం తీగను ఏ రాతి కన్నా ముడి వేయటం మంచిది. అప్పుడు, పైన తెగినా, మనం ఒక్కసారిగా లోయలోకి పడిపోం," అన్నాడు జయమల్లు.

జయమల్లు మాట ముగించే లోపలే, ముగ్గురిలో పై నున్న కోయ గోమాంగ్,




"ఆ దుర్మార్గులు తీగనరికేశారు!" అంటూ ఒక్కసారిగా అరిచి, తల కిందులైపోయాడు.

అతడితో పాటు కేశవుడూ, జయమల్లూ కూడా పట్టు తప్పి, గాలిలో ఒకటి రెండు పల్లటీలు కొట్టారు. కాని, వాళ్ళల్లో ఎవరూ తమ చేతిలో వున్న అడవి తీగను విడిచి పెట్టలేదు. ఆ జాగర్తే వాళ్ళను కాపాడింది. కను మూసి తెరిచేంత వ్యవధిలో వాళ్ళు తిరిగి రాళ్ళ కేసి గుంజ బడ్డారు. ముగ్గురి శరీరాలూ, శిఖరం దిగువనున్న రాళ్ళను బలంగా తాకినై.

"తెగ నరకబడిన అడవి తీగ మన అదృష్టం కొందికీ, దిగువను ఏ రాయినో చుట్టుకుని బిగుసుకుపోయింది," అన్నాడు జయమల్లు.

కేశవుడూ, గోమాంగ్ ఏదో జవాబివ్వ బోయేంతలో, కొండ శిఖరం మీది నుంచి గణాచారి ముఠా వాళ్ళు ఉత్సాహంగా, "ఆ దుష్టులు యీసరికి కింది లోయలోని రాళ్ళమీద పడి తునాతునియలై వుంటారు. మన పక్షి మాతల రెక్కలు నరుక్కు వెళ్ళే వాళ్ళందరికీ, యిదే చావు రాసిపెట్టివున్నది," అంటూ పెద్దగా కేకలు పెట్టారు.

ఆ కేకలకు లోయ అంతా ప్రతిధ్వనించింది. పెద్దపెద్ద చెట్ల మీద రెక్కలు చాచుకు నిలబడి వున్న గండభేరుండాలు గొంతులెత్తి కర్ణకఠోరంగా ఒక్కసారి అరిచినై. ఎక్కడో పులి ఒకటి రంకె వేసింది. ఈ భయంకర ధ్వనులను విని నిశ్చేష్టులైన కేశవుడూ అతడి అనుచరులు తెప్పరిల్లే లోపలే, ఒక మానవ కంఠం లోయలో నుంచి వినుక్కుంటున్నట్టు కటువుగా పలికింది: "కింకరా! ఏమిరా, ఆ రణగొణ ధ్వనులు? పులిరాజు కూడా మేల్కున్నాడు!" అన్నదా కంఠం.

ఆ వెంటనే జవాబుగా మరో గొంతు, "జగభోజ్ గురో! ఆ గణాచారి సజ్జు ఎవర్నో చంపి రాకాసిలోయ లోకి తోసినట్టుంది. ఈ గత్తర కంతా అదే కారణం," అన్నది.



"ఆ చచ్చిన వాళ్ళు బ్రహ్మపురం రాజూ, వాడి గురువూ కాదుగదా? వాళ్ళీ మధ్య మన చెవులపాలిట జోరీగల్లా తయారయ్యారు," అన్నాడు జగభోజి.

"వాళ్ళా! వాళ్ళిక్కడికి దారి తెలుసుకుని వచ్చే లోపల, మనం రాకన్నెను పెళ్ళాడి, ధనరాసులతో కూడా అంతర్ధాన మవుతాం. తరవాత వాళ్ళు యీ లోయలోని గండ భేరుండాలకూ, కొండ చిలవలకూ, క్రూర మృగాలకూ ఆహారం కావలిసిందే!" అన్నాడు కింకరుడు.

"అఁ, రాకన్నె! కింకరా, ఆ మాటే మరిచాను. అమావాశ్య యింకా పదమూడు రోజులున్నది. ఆ రాత్రిగాని నాకు ఆ కన్నెతో లగ్నం కుదరదు. ఇప్పుడు లోయలో రేగిన గడబిడకి ఆ అందాల హంస నిద్ర మేలు కుని కలవర పడుతున్నదేమో చూడు," అన్నాడు జగభోజి.

కింకరుడు పెద్దగా నవ్విన నవ్వడి అయింది. ఆ తరవాత వాడు పెద్దగా గొంతెత్తి, "గురో, ఆ కన్నె...కల్పకవల్లి... అందాల హంస కాదు, భయంకర బెబ్బులి! తన తండ్రి బ్రహ్మపురం రాజూ, ఆయన గురువూ కలిసి వచ్చి తనను కాపాడగలరనే యింకా భ్రమిస్తున్నది. అందుకే మిమ్మల్ని



చులకన చేసి మాట్లాడుతున్నది. ఆవిడ క్కాస్త, ఈ రాకాసిలోయ అంటే బెదురు పుట్టటం అవసరం, మీరలా వూరుకోండి," అన్నాడు కింకరుడు.

ఆ తరవాత అంతా నిశ్శబ్దం. లోయ కింది భాగం నుంచి వచ్చిన యీ సంభాషణ అంతా విన్న కేశవుడూ, జయమల్లూ, కోయ గోమాంగ్ ఆశ్చర్యంతో, భయంతో కంపించి పోయారు. ఒకటి రెండు క్షణాలపాటు మాట్లాడదామన్నా ఎవరికీ గొంతు పెగిలింది కాదు. ఆఖరికి జయమల్లు కంపిస్తున్న కంఠ స్వరంతో మెల్లిగా, "విన్నావా, కేశవా?" అని అడిగాడు.





"మనం బ్రహ్మపురం వదిలి చాలాకాల మైంది. ఈ లోపల అక్కడ చాలా మార్పులు జరిగినట్టుంది. రాజకుమార్తె కల్పకవల్లి, ఈ రాకాసిలోయ ఎలా చేరింది? ఈ జగ భోజి ఎవడు? కింకరుడనే వాడు వాడి శిష్యుడిలా వున్నాడు. మనం రాకుమారిని రక్షించ గలమా, జయమల్లూ?" అన్నాడు కేశవుడు.

జయమల్లు కేశవుడి మాటలు విని జవాబిచ్చే స్థితిలో లేడు. అతడు, జగభోజికీ, కింకరుడికీ జరిగిన సంభాషణ వెనక వున్న రహస్యం ఏమిటో తెలుసుకునేందుకూ, 'పులిరాజు' అన్న జగభోజి మాటల అర్థం కనుక్కొనేందుకూ ఆలోచిస్తున్నాడు.

"కేశవా! ఈ సంగతేమైనా నీకు గుర్తు వున్నదా? మనం బ్రహ్మపురం దగ్గిర కొండల్లో వున్నప్పుడు, బ్రహ్మదండి మాంత్రికుడు కాలభైరవుణ్ణి నీ మీదికి ఆవాహన చేశాడు. అప్పుడు నీవు ఆ మైకంలో కొన్ని రహస్యాలు చెప్పావు. అవేమిటో తరవాత నేను నీకు చెప్పాను," అన్నాడు జయమల్లు.

కేశవుడు అనుమానంగా జయమల్లు కేసి చూస్తూ తలాడించి, "ఆ గొడవేమీ నాకు అంతగా గుర్తు లేదు. ఈ రాకాసిలోయలో ధనరాసులున్న వన్న సంగతొక్కటే నాకు బాగా జ్ఞాపకం వున్న విషయం!" అన్నాడు.

"విన్నాను. మనకంటే ముందే యిక్కడికి మాంత్రికుడో ఎవరో చేరినట్టున్నది. వాడి స్వాధీనంలో మన బ్రహ్మపురం రాజు కూతురు కల్పకవల్లి వున్నది. వాడు, మనం వచ్చిన ధనరాసుల కోసమే యిక్కడ కాపలా వేశాడు," అన్నాడు కేశవుడు.

జయమల్లు ఏమీ మాట్లాడ లేదు. అతడు ఆలోచనలో పడ్డాడు. అదృష్టవశాత్తూ, వాళ్ళకు కొంచెం దిగువగా కొండ అంచు నుంచి బయటికి పొడుచుకు వచ్చిన రాళ్ళు కొన్ని కనిపించినై. తీగ మీది నుంచి నిశ్శబ్దంగా వాటి మీదికి జారి ముగ్గురూ, చీకట్లో చుట్టూ కలయ చూస్తూ కూచున్నారు.



అప్పటి వరకూ వాళ్ళిద్దరి సంభాషణా వింటూ, నిశ్చేష్టుడై కూచుని వున్న కోయ గోమాంగ్, హఠాత్తుగా ప్రాణం వచ్చిన వాడిలా కేశవుడి కేసి తల తిప్పి, "నా కళ్ళకు లోయ కావల ఎక్కడో దీపాల వెలుగు కనిపిస్తున్నది. చెవులకు ఏనుగులు ఘీంకరించిన ధ్వని వినబడుతున్నది," అన్నాడు.

"నా కలాంటి కాంతులు గాని, ధ్వనులు గాని వినిపించటం లేదు. నన్నేదో మత్తు ముంచేస్తున్నది. నాకీ రాకాసిలోయలోని బంగారమూ వద్దు వెండీ వద్దు. ప్రాణం విసిగిపోయింది. చావంటే నాకేం భయం లేదు—కాని, చచ్చే ముందు ఒక్కసారైనా మా అయ్యను చూడగలిగితే, ఎంత బావుండును!" అంటూ కేశవుడు కళ్ళు మూసుకుని, వెనక్కు చేరగిలబడి పోయాడు.

జయమల్లు కేశవుడి భుజం పట్టుకుని లాలిస్తూ, "నిరుత్సాహ పడకు, కేశవా! ఎన్నో భయంకర ప్రమాదాలను ధైర్యంగా ఎదుర్కొని, జయించి యిక్కడికి చేరాం. జగభోజి, వాడి శిష్యుడు కింకరుడి సంభాషణ విన్న తరవాత నాకు మన కష్టాలు తీరే సమయం ఆసన్నమయిందని నమ్మకం కలుగుతున్నది. మనం, నీ ముసలి తండ్రినే కాదు, బ్రహ్మపుర రాజునూ, రాజ గురువునూ—అందర్నీ చూడగలగవచ్చు. ఈ లోయలోని నిధులు మాత్రం మనవి. అవి సంపాయించే శక్తి మనకే వున్నది. వాటి మీది హక్కు కూడా మనదే, యిందులో సంశయించటాని కేమీ లేదు," అన్నాడు.




"భవిష్యత్తు మన కనుకూలంగా వున్నదని, అంత నమ్మకంగా నీ వెలా చెప్పగలవు?" అని అడిగాడు కేశవుడు.

జయమల్లు ఓ క్షణకాలం తల పంకిస్తూ వూరుకుని తరవాత, చిన్న గొంతుతో, "కాలభైరవుడు నిన్నావేశించినప్పుడు, నీవు బ్రహ్మదండి మాంత్రికుడితో అన్న మాటలివి: 'వింధ్యారణ్యాల కవతల ఒక గొప్ప కొండ





లోయ వున్నది. అదే రాకాసిలోయ! ఆ లోయలో ఒక చోట ఎత్తయిన ఒక రావి చెట్టు, దాని కింద ఒక పాము పుట్ట...ఎండి మోడుగా వున్న చెట్టు వెన్నెల రాత్రి ఫల పుష్పాలతో నిండి పోతుంది...పులిరాజును చంపి, చర్మం వలిచి, దాన్ని...'ఆ తరవాత బ్రహ్మపుర రాజగురువు తన మంత్రశక్తితో నీ నోరు కట్టేశాడు," అని చెప్పాడు.

"అంతా బాగానే వున్నది. మనం రాకాసి లోయ చేరామన్న సత్యం ఒక్కటి తప్ప, తతిమ్మా మాటల్లో వున్న నిజమెంతో యింత వరకూ సూచనగా నైనా బయటపడలేదు," అన్నాడు కేశవుడు నిస్పృహగా.

"కాలభైరవుడు ఆవేశించినప్పుడు, నువ్వు చెప్పిన ప్రతి అక్షరం నిజమై తీరుతుంది. ఇంతకు ముందు జగభోజి అన్న మాటల్లో 'పులిరాజుకూడా మేల్కొన్నాడు!' అన్న పదం అర్థం ఏమిటి? మనం సూర్యోదయం కాగానే లోయలోకి దిగి, ఏదో విధంగా ఆ పులిరాజును చంపబోతున్నాం. తరవాత దాని చర్మం వలిచి, దాన్ని..."

జయమల్లు మాట ముగించే లోపలే, వాళ్ళు కూర్చుని వున్న కొండరాళ్ళకు దిగువగా పెద్దపులి భయంకరంగా రంకె వేసింది. ఆ ధ్వని వింటూనే ముగ్గురూ తలలు వంచి కిందికి చూశారు. వాళ్ళకు నిప్పు రవ్వల్లా కణకణ లాడుతూ మెరుస్తున్న రెండు కళ్ళు లోయ అడుగున కనిపించినై.

"ఇదే పులిరాజు! ఆ మెరుస్తున్న కళ్ళు మనం చూడ గలుగుతున్నామంటే, అది మోర ఎత్తి, మన కేసే చూస్తున్న దన్న మాట!" అన్నాడు కోయ గోమాంగ్.

"మన నది గుర్తించింది, ధాన్ని మనం గుర్తించాం, బావుంది! ఒకళ్ళ నొకళ్ళు చంపుకునేందుకు వెతుక్కోవలసిన శ్రమ తప్పింది. గోమాంగ్! నీ దగ్గిర విషం పూసిన అంబులు వున్నవి గదా?" అన్నాడు జయమల్లు.



32

"వున్నవి. ఇప్పుడే పులి వేట ప్రారంభిద్దామంటావా, మల్లూ?" అని అడిగాడు కోయ గోమాంగ్.

"వేటకు యిది సరైన సమయం కాదు. ఈ చీకట్లో, మనం చంపిన పులిరాజును జగభోజి ఎత్తుకు పోవచ్చు. మనం దాన్ని కొంచెం రహస్యంగా చంపాలి. అది మనను విడిచి పారిపోతుందన్న భయం లేదు. మన వాసన పశి కట్టింది గనక మనం దానికి గుర్తు; దాని మెరిసే కళ్ళు చూశాం కనక, మనకు అది గుర్తు. ఎవర్ని ఎవరు చంపి చర్మం ఒలుచుకోగలమో ఉదయం కాగానే చూద్దాం. ఆ తరవాత జగభోజి అంతు తేల్చాలి," అన్నాడు జయమల్లు నిబ్బరంగా. గోమాంగ్, జయమల్లులు సంభాషిస్తున్నంతసేపూ కేశవుడు నిశ్చలంగా కూచుని వున్నాడు. వాళ్ళిద్దరి సంభాషణా ఆగిపోగానే అతడు, జయమల్లు కేసి ఆశ్చర్యంగా చూస్తూ, "మల్లూ, నాకేం మతి పోవటం లేదుగదా! మేలుకుని వుండే కలలు కంటున్నానేమో అని భయంగా వున్నది. లోయ కావలి నుంచి ఏమిటా ధ్వనులు? వింతగా వుందే!" అన్నాడు.

"నీకూ, ఏనుగుల ఘీంకారం లాటి ధ్వనులు వినబడుతున్నవా?" అని ప్రశ్నించాడు, జయమల్లు.



"ఏనుగులు చేసే ఘీంకారాలే కాదు, ఎక్కడో గంటల చప్పుడు కూడా వినబడుతున్నది. ఏమంటావ్, గోమాంగ్? నీ కలాటి ధ్వను లేమైనా వినబడుతున్నవా?" అని అడిగాడు కేశవుడు.

"ఇదంతా ఏదో మాయలా వుంది. నాకు గంటలు మోగుతున్న ధ్వనే కాదు, గాలి మోసుకొస్తున్నట్టు, ఏవో మాటలు కూడా వినబడుతున్నవి. నన్నడిగితే, యిదంతా ఏదో మంత్ర ప్రభావం వల్ల మనకు కలుగుతున్న భ్రమ అంటాను," అన్నాడు గోమాంగ్.

కోయ గోమాంగ్ మాటలు జయమల్లులో రకరకాల ఆలోచనల్ని రేకెత్తించినై. గోమాంగ్ అన్నట్టు ఈ రాకాసిలోయ అంతా మంత్రగ్రస్తమా? జగభోజి బ్రహ్మపుర రాజు కూతురు కల్పకవల్లిని, ఏవిధంగా యిక్కడికి తీసుకు రాగలిగాడు? ఈ లోయలో నుంచి కాలు బయటికి పెట్టకుండానే, వాడా కార్యం సాధించాడా?

జయమల్లు అంతు దొరకని యిలాంటి ప్రశ్నలకు సమాధానాల కోసం సతమతమవుతుంటే, కేశవుడు తన తండ్రి యీ సమయంలో యిక్కడ వుంటే, ఎంతో బావుండేదని ఆలోచిస్తున్నాడు. కోయ గోమాంగ్ తమ నాయకుడైన గడేజంగ్ వస్తే, రాజకుమారి జగభోజి చెర నుంచి విముక్తురాలు కాగలదని యోచిస్తున్నాడు.

రాకాసిలోయకు యీవలి వైపున ఆ ముగ్గురు మిత్రులూ ఎవరి ఆలోచనల్లో వారుండగా, లోయకు ఆవల నున్న మైదానంలో బ్రహ్మపురం రాజూ, రాజగురువూ సైన్యం మధ్య తమ కోసం నిర్మించబడిన డేరాల్లో కూచుని ముందు కర్తవ్యం గురించి చర్చలు జరుపుతున్నారు. వాళ్ళను పట్టుకున్న సమస్య; సైన్యంతో రాకాసిలోయ లోకి దిగటమా? లేక కొద్దిమంది అంగరక్షకుల్ని వెంట తీసుకుని లోయలోకి ప్రవేశించటమా? అన్నది. —(ఇంకావుంది)





# దుష్టురాలు

కోసలదేశపు రాజు మార్తాండవర్మకు ప్రమోదకుడనే కొడుకూ, మాలిని అనే కూతురూ ఉండేవారు. మాలిని చిన్నతనం నుంచీ కుశదేశంలో తన మేనమామల ఇంట పెరిగి పెద్దదయింది. ప్రమోదకుడు సకల విద్యలూ పూర్తి చేసి, లోకానుభవం కొరకు దేశయాత్ర వెళుతూ, ఏ దేశంలోనైనా తన చెల్లెలికి తగిన వరుడుంటే చూడటానికీ, తిరిగి వచ్చేటప్పుడు మేనమామల ఇంటి నుంచి చెల్లెలిని తన వెంట తీసుకు రావటానికీ నిశ్చయించుకున్నాడు.

అతను అనేక దేశాలు తిరిగి చివరకు కుశదేశం చేరాడు. వేరువేరు దేశాలలో తాను చూసిన యోగ్యులైన రాజకుమారులను గురించి అన్న చెప్పాడు, కాని మాలిని అందరినీ నిరాకరించింది. ప్రమోదకుడు కొద్ది రోజుల తరవాత మాలినిని వెంట బెట్టుకుని కోసలకు బయలుదేరాడు.

వారిద్దరూ ఒక రథమెక్కి అరణ్యమార్గాన వస్తుండగా ఒక చోట దొంగల గుంపు వారి పైన పడింది. వెంటనే ప్రమోదకుడు కత్తి దూసి దొంగల మధ్యకు దూకి, ఒక్కసారి కత్తి అటూ ఇటూ ఊపే సరికి ఒక పక్క ఆరుగురూ, రెండో పక్క ఐదుగురూ తలలు తెగి పడిపోయారు. ఈ సంఘటన చూసి మిగిలిన దొంగలు కొయ్యబారిపోయారు.

దొంగల నాయకుడు ప్రమోదకుణ్ణి శరణు వేడాడు. "నీవు శరణు వేడగానే సరికాదు, నీ ముఠా నంతటినీ పంపెయ్యాలి, నీవూ ఈ అరణ్యాన్ని విడిచి పోవాలి," అన్నాడతను దొంగల నాయకుడితో.

"అలాగే చేస్తాను. నేను చాలా ధనం సంపాదించాను. అదంతా మీ పరం చేసేస్తాను. ఆ తరవాత ఏ నగరానికన్నా పోయి మరేదైనా జీవనోపాధి కల్పించుకుంటాను.

వి. జగన్నాథం



ఇప్పుడు మీరిద్దరూ నా భవనానికి వచ్చి రెండు రోజులపాటు నా అతిథులుగా ఉండాలని నా ప్రార్థన," అన్నాడు దొంగల నాయకుడు.

వృత్తి చేత దొంగ అయినా వాడు స్ఫుర ద్రూపిగానూ, మర్యాదలు తెలిసిన వాడు లాగానూ కనిపించాడు. అతని ఆతిథ్యం స్వీకరించటానికి మాలిని ఏమీ అభ్యంతరం చెప్పనందున ప్రమోదకుడు దొంగల నాయ కుడి ఇంటికి తన చెల్లెలితో సహా వెళ్ళాడు. అరణ్యం మధ్యంలో ఉన్న ఆ ఇల్లు ఇంచు మించు రాజభవనం లాగున్నది. ఇంటి నిండా బోలెడంత మంది దాసదాసీ జనం ఉన్నారు. అతిథులకు ఆ ఇంట అన్ని మర్యాదలూ జరిగాయి, అన్ని సౌకర్యాలూ అమరాయి.

మర్నాడు తెల్లవారు జామునే మాలిని తన అన్నతో, "నాకు విపరీతమైన తల పోటుగా ఉన్నది. రాత్రి నాకు కలలో ఒక భూతం కనిపించి, తల నొప్పితో చచ్చిపోతా నని చెప్పింది. తరవాత ఒక ఋషి కని పించి, నన్ను భయపడ వద్దని చెప్పి, తూర్పు దిక్కున ఎర్రకొండ కింద చెరు వున్నదనీ, దాని నీరు తాగితే తలపోటు తగ్గి పోతుందనీ చెప్పాడు. నిద్ర లేస్తూనే తల పోటు ఆరంభమయింది. ఆ ఎర్రకొండ ఎక్కడ ఉన్నది? అక్కడికి వెళ్ళి నా కా చెరువు నీరెవరు తెస్తారు? నాకు చావు తప్పదు," అని బెంబేలు పడిపోయింది.

"నేను వెళ్ళి నీరు తెస్తాను. నీవు ధైర్యంగా ఉండు," అని చెల్లెలితో అని, ప్రమోదకుడు తూర్పు దిక్కుగా ప్రయాణ మయి వెళ్ళాడు.

అతను అడవిలో చాలాదూరం వెళ్ళగా ఒక ఎలుగుబంటి ఎదురు వచ్చింది. ప్రమోదకుడు దాన్ని లక్ష్యపెట్టక తన పని మీద తాను ముందుకు వెళ్ళాడు. మరి కొంతదూరం వెళ్ళాక ఒక పక్కనుంచి

పెద్ద పులి అతన్ని చూసి గాండ్రుమన్నది. దాన్నికూడా అతను లక్ష్య పెట్టలేదు. మరి కొంత దూరం వెళ్ళాక ఒక సింహం గర్జిస్తూ అతనికి ఎదురుపడింది. దాన్నికూడా అతను లక్ష్యపెట్టక ముందుకు సాగి, ఎర్రకొండ దిగువన ఉన్న చెరువులో తన వెంట తెచ్చిన పాత్రను ముంచి నీరు తెచ్చుకున్నాడు.

అతను తిరిగి వచ్చేటప్పుడు అతని దారికి అడ్డంగా సింహమూ, పులీ, ఎలుగుబంటీ నిలబడి కనిపించాయి. సింహం మనిషి భాషలో, "అబ్బాయీ, నీవు నిజమైన ధైర్య శాలివి. మా భయం చేత ఈ ప్రాంతాల కెవరూ రారు. ఒక వేళ దారి తప్పి వస్తే మమ్మల్ని చూసి భయపడి పారిపోతారు, లేదా మమ్మల్ని చంప యత్నిస్తారు. అంతే గాని నీలాగా నిర్భయంగా వెళ్ళిపోయినవా రెవరూ లేరు. ఇటు వచ్చినవారంతా మాచేత చచ్చారు. నీ కెప్పుడైనా ఆపద గలిగితే ఈ కొమ్ము తీసుకుని ఊదు," అని చెప్పి తన కాళ్ళ వద్ద ఉన్న కొమ్ము ఒకటి ప్రమోదకుడికి చూపింది.

ప్రమోదకుడు దాన్ని తీసుకుని దొంగల నాయకుడి ఇంటికి వచ్చేశాడు. అతను తెచ్చిన నీరు తాగి తన తల నొప్పి పోయిం దన్నది మాలిని. ఆమె అతనితో, "నీవు




వెళ్ళిన దారి చాలా అపాయమైనదిట. నీ కేమీ ప్రమాదం ఎదురు కాలేదుగద ?" అని అడిగింది.

"ఏమీ లేదే!" అన్నాడు ప్రమోదకుడు.

తరవాత దొంగల నాయకుడు తన అతి థులకు తాను కొల్లగొట్టిన ధనరాసులు చూపించాడు. అతను ఆ వస్తువుల మధ్య నుంచి ఇనుప సంకెళ్ళు తీసి, "వీటిని చేతులకు ధరించి తెంపగల వాడిది నిజమైన బలం! మీరు చాలా బలశాలి అనీ, దీన్ని తెంపగలరనీ మీ చెల్లెలుగారన్నారు. నేను తెంపలేరన్నాను. ఇద్దరమూ పందెం వేసు కున్నాం," అన్నాడు ప్రమోదకుడితో.



"మా అన్నయ్య తప్పక తెంపగలడు," అన్నది మాలిని.

"అసాధ్యం! మీరు తెంపలేనని ఒప్పేసుకోండి. పందెంలో నేను గెలుస్తాను," అని దొంగలనాయకుడు ప్రమోదకుడికి నవ్వుతూ సలహా ఇచ్చాడు.

మాలిని రోషంతో, "ఒప్పుకోకు, అన్నయ్యా! వాటిని తెంపి చూపించు. పందెంలో నేనే గెలవాలి," అన్నది.

ప్రమోదకుడు ఒక్క క్షణం ఆలోచించి, "తెంపటానికి యత్నిస్తాను," అంటూ చేతులు చాచి దొంగల నాయకుడి చేత సంకెళ్ళు వేయించుకున్నాడు. ప్రమోదకుడు వాటిని, ఎంత ప్రయత్నించికూడా, తెంచలేక పోయాడు.

మాలిని విరగబడి నవ్వి, "నేను పందెంలో ఓడిపోయాను. పందెం ప్రకారం నేనీ దొంగల రాజును పెళ్ళాడి తీరాలి. ఈ సంకెళ్ళతో నీవు సింహాసనం మీద కూర్చోపటానికి తగవు. అందుచేత ఈ కొట్టులోనే పడి ఉండు. ఇకనుంచీ నేను రాణిని, నా భర్త రాజు!" అన్నది.

"ఈ దొంగ చేత మోసపోయావా? లేక నీవే నన్ను మోసగించావా?" అని ప్రమోదకుడు తన చెల్లెలి నడిగాడు.

"ఇంక నీ వద్ద దాపరికం దేనికి? ఈ దొంగ నాకు పాత స్నేహితుడే. మేమిద్దరమూ ప్రేమించుకున్నాం. దొంగవృత్తి మానమంటే, తనకు రాజ్యం ఇప్పించినట్టయితే మానుతా నన్నాడు. అతను రాజుకావటానికి అడ్డుగా ఉన్నది నీవే కనుక, నిన్ను చంపటానికి తన ముఠాతో వచ్చిపడి ఓడిపోయాడు. అందుచేత నిన్ను మరొక విధంగా చంపెయ్యటానికి తలనొప్పి నటించి ఎర్రకొండకు పంపాను. ఆ ఎత్తుకూడా పారలేదు. నీవు ప్రాణాలతో తిరిగి వచ్చావు. చివరకు ఈ మూడో ఎత్తు పారింది. నిన్ను ఈ కొట్టులో బంధించి ఉంచుతాము.

మిగతా పని ఆకలిదప్పులే తీర్చుతాయి!" అని తన అన్నతో ఆ దుష్టురాలు నిజం చెప్పేసింది.

తరవాత మాలినీ, దొంగా కొట్టు బయటికి వెళ్ళి తలుపుకు తాళం పెట్టేశారు.

ఇప్పుడు ప్రమోదకుడికి కొమ్ము ఉపయోగపడింది. దాన్ని అతను నోటి దగ్గిర పెట్టుకుని ఊదాడు. అంతలోనే అతనున్న కొట్టు తలుపులు పెళపెళా విరిగి పడ్డాయి; సింహమూ, పెద్ద పులీ, ఎలుగుబంటీ లోపలికి వచ్చాయి. ఎలుగుబంటి అతని చేతి సంకెళ్ళను ఒక్క గుంజుతో తెంచేసింది. ఈలోపుగా సింహమూ, పెద్దపులీ దొంగల నాయకుడి ఇల్లంతా గాలించి దాక్కున్న వాళ్ళనూ, పారిపోయే వాళ్ళనూ కూడా చంపేశాయి. మాలినీ, ఆమె ప్రియుడైన దొంగా కూడా వాటి వాతపడి చచ్చారు.

ప్రమోదకుణ్ణి బంధవిముక్తుణ్ణి చేసిన ఎలుగుబంటి అతను చూస్తుండగానే మాయమై, దాని స్థానంలో ఒక అద్భుత సౌందర్యవతి అయిన అమ్మాయి నిలబడింది. "ఎవరు నీవు? ఏమిటీ వింత?" అని ప్రమోదకుడామెను అడిగాడు.

"నా పేరు మాధవి. మిగతా వివరాలు మా వాళ్ళు చెబుతారు," అని ఆమె అంటూండగానే సింహమూ, పులీ అక్కడికి



వచ్చి, మాధవిని ఎంతో ప్రేమతో రుద్దుకున్నాయి. మాధవి అతనితో, "ఈ పులినీ, సింహాన్నీ మీ కత్తితో నరికెయ్యండి," అన్నది. ఆ మాట వింటూంటే అతనికి మాధవి మాలిని కన్న క్రూరురాలులాగా కనబడింది.

మాధవి అతని అనుమానం చూసి నవ్వి, "వీరిద్దరూ నా తల్లి దండ్రులు. నాలాగే శాపగ్రస్తులు. మీరు నరికేసినట్టయితే వారికి శాపవిమోచనం కలుగుతుంది," అన్నది.

ప్రమోదకుడు ఇక సంకోచించక తన కత్తి తీసుకుని ఒకే దెబ్బతో పులినీ, సింహాన్నీ కూడా నరికేశాడు. ఆ రెండు మృగాల స్థానంలో రాజదంపతులు ప్రత్యక్షమయారు. రాజు ఇలా చెప్పాడు:

"నాయనా, నేను శూరదేశపు రాజును. ఒకనాడు నేను ఈ నా భార్యతోనూ, రెండేళ్ళ యీడు గల ఈ నా కుమార్తెతోనూ ఎర్ర కొండ ప్రాంతాన విహారానికి వెళ్ళాను. వెళ్ళిన వాణ్ణి వూరుకోక ఒక మునీశ్వరుణ్ణి చూసి హేళన చేశాను. ఆ ముని అలిగి, మమ్మల్ని ముగ్గురినీ వన్యమృగాలు కమ్మని శపించాడు. నే నాయన కాళ్ళపై పడగా, మమ్మల్ని చూసి భయపడని వాడి చేతిలో మాకు శాప విమోచనం కలిగేటట్టూ, నా కుమార్తె ఎవరినైనా ప్రేమించగానే దానికి యథారూపం వచ్చేటట్టూ అనుగ్రహించాడు. మా కుమార్తె నిన్ను ప్రేమించింది కాబోలు ఆమెకు మానవ రూపం వచ్చేసింది. నీ చేతి వేటు తింటేగాని మాకు శాపవిముక్తి కలగ లేదు. ఇదే మా కథ."

తరవాత శూరదేశపురాజు తన భార్యనూ, కుమార్తెనూ, ప్రమోదకుణ్ణీ వెంట బెట్టుకుని తమ దేశానికి వెళ్ళాడు. అప్పటిదాకా రాజ్యం చూస్తున్న మంత్రులు తమ రాజు రాకకు పరమానందం చెందారు. ప్రమోదకుడు తనను ప్రేమించిన మాధవినే పెళ్ళాడి, కాలక్రమాన కోసల దేశంతో బాటు శూర దేశాన్ని కూడా తానే పాలించాడు.





# రత్నవతి కథ

సౌరాష్ట్ర దేశానికి చెందిన వలభీ పట్టణంలో గృహగుప్తుడనే సంపన్నుడుండేవాడు. ఆయన ఓడ వ్యాపారం చేసేవాడు. ఆయనకు రత్నవతి అనే కూతురుండేది. ఆమెను మధుమతీ నగరవాసి అయిన బలభద్రుడనే వర్తకుడి కిచ్చి వివాహం చేశారు. కాని మొదటి రాత్రే అతను తన భార్యపై అలిగి, ఆమె ముఖం చూడకుండా వెళ్ళిపోయాడు. ఆమెను ఏలుకోమని ఎంతమంది మిత్రులు చెప్పినా అతను వినిపించుకోలేదు.

భర్త ఏలుకోని భార్య గతి ఏమవుతుందో రత్నవతి గతి అదే అయింది; ఆమెను కన్నవారు కూడా చులకనగా చూశారు. రోజులు గడుస్తున్న కొద్దీ ఆమెకు తన భవిష్యత్తు తలుచుకుంటే భయం వేసింది. ఒక రోజు ఆమెకు ఒక ముసలి యోగిని కనిపించింది. ముసలిది దేవుడికి పూజచేసిన పూలు తెస్తున్నది. ఆ యోగినిని చూసి రత్నవతి వెక్కి వెక్కి ఏడవసాగింది. ముసలిది ఆమెను ఓదార్చి, "ఎందు కేడుస్తావమ్మా? కారణం ఏమిటో చెప్పు," అన్నది. రత్నవతి ఒకవంక చెప్పటానికి బిడియపడుతూనే ముసలిదానితో అంతా చెప్పేసి, "భర్త విడిచిన ఆడది చచ్చినదాని కిందనే లెక్క. అందుకు నేనే నిదర్శనం. మా అమ్మ మొదలుకుని ప్రతి ఒక్కరూ నన్ను చులకనగా చూస్తున్నారు. నాపై వారికి గౌరవం కలిగేటట్టు చెయ్యి, లేదా నేను ప్రాణత్యాగం చేసుకుంటాను. నేను చచ్చినదాకా ఈ సంగతి మరెవరికీ చెప్పకు," అని ఏడ్చింది.

యోగినికి కూడా కళ్ళు చెమ్మగిల్లాయి. ఆమె రత్నవతిని ఆలింగనం చేసుకుని, "బిడ్డా, సాహసం చెయ్యకు. నీకు జీవితం మీద విరక్తి కలిగితే నాతోబాటు తపస్సు చెయ్యి. లేదూ, నీ భర్త చేసినదానికి విరుగు

డేమైనా ఉంటే, అందుకు నా చేతనయిన సహాయం యావత్తూ చేస్తాను. ఏం చెయ్యమంటావో చెప్పు," అన్నది.

"స్త్రీకి భర్తకంటె కావలిసిన దేమున్నది? నాకు నా భర్త తిరిగి లభించే ఉపాయం చూడాలి. మా యింటికి సమీపంలో నిధిదత్తు డనే వర్తకు డున్నాడు. ఆయన గొప్ప కులీనుడూ, రాజాదరణ గలవాడున్నూ. ఆయన కుమార్తె కనకవతి అచ్చగా నన్ను పోలి ఉంటుంది, నాకు స్నేహితురాలు. నేను దాని కన్న ఎక్కువగా నగలు ధరించి అలంకరించుకుని దానితో బాటు వారి మేడ మీద విహరిస్తూ ఉంటాను. అప్పుడు నీవు వచ్చి, వాళ్ళ అమ్మ పిలుస్తున్నదని దాన్ని మేడ మీది నుంచి పంపేసి, మేడ కిందికి ఏదో విధంగా నా భర్త వచ్చేటట్టు చెయ్యి. నేను పొరపాటున పడేసినట్టుగా బంతిని కింద పడేస్తాను. అప్పుడు నీ వాయనతో నేను కనకవతి నని చెప్పి, ఆ బంతిని ఆయన తెచ్చి నా కిచ్చేటట్టు చెయ్యి. తరవాత నే నాయనను ఎలాగో వశపరుచుకుంటాను," అని రత్నవతి ముసలి యోగినితో అన్నది.

ముసలిది తన పని తాను నిర్విఘ్నంగా కొనసాగించింది. బలభద్రుడు నిధిదత్తుడింటికి వచ్చి మేడ మీద బంతితో ఆడుకుంటున్న తన భార్యను చూసి గుర్తించక,



కనకవతే అనుకున్నాడు. ముసలిదాని ప్రేరణతో, కింద పడిన బంతిని తీసుకు పోయి ఆమె కిచ్చాడు. ఆ సమయంలో రత్నవతి అతన్ని ఆలింగనం చేసుకున్నది. బలభద్రుడామెపై అనురాగం పొంగి పొరలగా, రాత్రికి రాత్రే తన ధనాన్నంతా తీసుకుని, రత్నవతితో సహా దేశాంతరానికి ప్రయాణమై వెళ్ళిపోయాడు.

మర్నాడు గృహగుప్తుడి ఇంట గగ్గోలు పుట్టింది. రత్నవతి ఎక్కడా కనిపించలేదు. అందరూ ఆందోళనచెంది ఉన్నసమయంలో యోగిని వచ్చి, "నిన్న మీ అల్లుడు బలభద్రుడు నా దగ్గిరికి వచ్చి తాను చేసిన పనికి పశ్చాత్తాపం ప్రకటించాడు. తన భార్యను బహిరంగంగా ఏలుకోవటానికి సిగ్గు పడ్డట్టు కనిపించాడు. అందుచేత ఆమెను వెంటబెట్టుకుని రహస్యంగా దేశాంతరం వెళ్ళి ఉంటాడు. నిజం త్వరలోనే తెలుస్తుంది. మీరేమీ కంగారు పడకండి," అని చెప్పింది.

ఈ మాటలతో సంతృప్తిపడి ఆ ఇంటివారు రత్నవతి కోసం వెతికే ప్రయత్నం నుంచి విరమించారు.

రత్నవతి దారిలో ఒక దాసీని కుదుర్చుకుని, తమకు అవసరమైన సంబారాలన్నీ కొని దానిచేత మోయించుకుని, తన భర్తతో



సహా ఖేటక మనే ఊరు చేరింది. అక్కడ బలభద్రుడు తన వ్యాపారదక్షత అంతా చూపి బాగా డబ్బు గడించి, ధనికుడయాడు.

ఒకనాడు రత్నవతి తన దాసీ దానిని బాగా చీవాట్లు పెట్టి, "ఒక పనీ సరిగా చెయ్యవు, కనిపించినదెల్లా కాజేస్తావు, అదే మంటే పెడసరంగా మాట్లాడతావు!" అంటూ రెండు దెబ్బలు కూడా వేసింది.

దాసీ దానికి ఆగ్రహం వచ్చి తనకు తెలిసిన రహస్యాన్ని అస్త్రంలాగా ఉపయోగించింది. అది దండనాథికారి వద్దకు వెళ్ళి, "ఈ బలభద్రుడనే ఆయన వలభినగరంలో ఉండే నిధిదత్తుడనే ఆయన కూతురిని, కనకవతి అనే దాన్ని రహస్యంగా లేవదీసుకు వచ్చాడు," అని చెప్పింది.

దండనాథికారి ధనకాంక్ష జాస్తిగా గల వాడు. బలభద్రుడి ధనం కాజెయ్యటానికి మంచి అవకాశం చిక్కింది. అతను పెద్ద లను నలుగురినీ పిలిచి, బలభద్రుణ్ణి గురించి దాసీది చెప్పిన మాటలు చెప్పి, "ఇతడి డబ్బంతా అపహరించేద్దాం. మీరేమీ అభ్యంతరం చెప్పకండి," అన్నాడు.

ఈ సంగతి తెలియగానే బలభద్రుడు భయపడిపోయాడు. అతని బెదురు చూసి రత్నవతి, "మీకు వచ్చిన భయమేమీ లేదు. మీరు గ్రామపెద్దల వద్దకు వెళ్ళి, నేను గృహగుప్తుడి కూతురు రత్నవతిననీ, మన ఇద్దరికీ శాస్త్రోక్తంగా వివాహం జరిగిందనీ, కావలిస్తే వలభీకి మనిషిని పంపి వాకబు చేయవచ్చుననీ చెప్పండి. మనకు ప్రమాద మేమీ రాదు," అన్నది.

బలభద్రుడు పెద్దల ఎదట అలాగే చెప్పాడు. వారు వలభీకి ఒక మనిషిని పంపారు. ఆ మనిషి వెంట గృహగుప్తుడూ స్వయంగా వచ్చి, తన కూతురినీ అల్లుణ్ణీ గురించి, పెద్దల సందేహం నివృత్తి చేసి, కూతురినీ అల్లుణ్ణీ తన వెంట తీసుకుని ఇంటికి వెళ్ళిపోయాడు.





# అంతరాత్మ

పూర్వం గంగానదీ తీరాన బాబూలాల్ అనే అతడు ఒక పిండిమర పెట్టుకుని జీవనోపాధి సాగించుకుంటున్నాడు. ఊళ్ళోవాళ్ళే కాకుండా, పరిసర ప్రాంతస్థులు కూడా ఈ మరకు బియ్యమూ, పప్పు దినుసులూ తెచ్చి పిండి ఆడించి పట్టుకపోయ్యేవారు. తన కష్టానికి బాబూలాల్ డబ్బులు పుచ్చుకునే వాడు కాదు. ఆ తెచ్చిన దినుసులో పదవ వంతు తన కూలీగా వారి నుంచి తీసుకునేవాడు.

అయితే, ఇలా పదోవంతు దినుసు తీసుకుంటే కొంచెం కొంచెంగా వచ్చే రాబడివల్ల బాబూలాల్‌కు తృప్తి కలగలేదు. త్వరలో ధనికుడు కావాలని ఆత్రం పట్టుకుంది.

బాబూలాల్ మరకు వచ్చే కాతాదారుల్లో ఒక పెద్ద రయితున్నాడు. ఆయన పదిహేను రోజుల కొకసారి కొన్ని బస్తాల బియ్యం తెచ్చి, పడేసి పోతూవుంటాడు.

ఒకప్పుడు ఆ పెద్దరైతు ఇలాగే బియ్యం బస్తాలు తెచ్చి పడవేశాడు. ఆయన వెళ్ళి పోగానే బాబూలాల్‌కు మనస్సులో ఒక ఆలోచన కలిగింది; "ఈయన సరకులో మామూలు నా పదోవంతు కంటె కొంచెం ఎక్కువ తీసుకుంటే చూడవచ్చాడా? ఇంత మొత్తంలో అదేం తెలుస్తుంది? తక్కిన పిండి మర వాళ్ళందరో ఇలా చేసి భాగ్యవంతు లవుతున్నారు. నేను మట్టుకు ఎందుకు కాకూడదు?" అని.

ఉద్దేశించినట్టుగానే బాబూలాల్ ఆ రోజున న్యాయమైన తన పదో వంతు కన్న కొంచెం ఎక్కువగానే తీసి, వేరే ఒక తట్టలో పడవేశాడు. అయితే—ఇలా పడవేసినప్పటి నుంచీ అతని మనస్సు పీకుతున్నది. ఏమీ?—చేసింది శుద్ధ తప్పుపని అని అతనికి బాగా తెలుసు. అయినా అన్యాయంగా తీసిన ఆ పై బియ్యం తిరుగా అసలు

వై. సుందరమూర్తి



సరకులో వేసేద్దామా అంటే, అందుకూ మనస్కరించ లేదు.

ఇటువంటి సమయంలో మరివక ఆలోచన తట్టింది, బాబూలాల్‌కు. ఒక పేద వితంతువు బస్తా బియ్యం తెచ్చి అతని ఎదటనే చేరవేసింది. అది చూచి బాబూలాల్, "ఈమె చాలా పేదరాలు. ఈమె వద్ద నా పదవవంతు కంటె తక్కువగా తీసుకుంటాను. పేదవాళ్ళకు సాయం చేస్తె పుణ్యం కూడా. ఆ పాపానికీ ఈ మంచి పనికీ సరిపోతుంది." అనుకున్నాడు.

కొన్నాళ్ళ తరవాత పెద్ద రైతువద్ద నుంచి మళ్ళీ కొన్ని బస్తాల బియ్యం వచ్చి పడింది. ఈ సారి కూడా బాబూలాల్ తన పదో వంతుకు మించే తీసుకున్నాడు. ఎన్ని సార్లయినా ఇలా రయితు సరకులో ఎక్కువ భాగం తీసుకుంటూనే వున్నాడు. కాని, ఆ నాడు అనుకున్నట్టు, పేద ఆపె సరకులో నించి కచ్చితంగా తగ్గించి తీసుకోవటం లేదు.

ఈ విధంగా దొంగిలించిన అన్యాయార్జితం కొట్టులో తట్టలతో నిండిపోతూ, వృద్ధి అవుతూంది కాని, మనసులో మాత్రం శాంతి అంతకు అంత తగ్గిపోతూ వచ్చింది.

బాబూలాల్ గొప్ప భక్తుడు. సాయంకాలం రోజూ ప్రార్థన మందిరానికి వెళ్ళటం పరిపాటి. ఆ రోజున వెళ్ళి కూర్చునే సరికి మందిరంలో గోడలకు వేలాడ గట్టబడిన నీతివాక్యాలు అతన్ని ఆకర్షించాయి. అందులో 'దొంగతనము చేయరాదు' అనే వాక్యం మొట్ట మొదటిది.

ముందంతా, అవతల మర ఆడుతూ వుంటే ఇవతల కూర్చుని మంచి పుస్తకాలు చదువుతూండే వాడు. మిత్రులతో ప్రసంగించేవాడు. 'ఫలానావాడు ఫలానా దొంగతనం చేసినందుకు ఇన్ని నెలలు శిక్ష పడ్డాడు,' అని ఎవరన్నా చెబితే ఆసక్తితో వినేవాడు. ఇప్పుడా ప్రసక్తి వస్తె వినిపించుకోకుండా తప్పించుకుంటున్నాడు.

బాబూలాల్ ప్రార్థన మందిరానికి వెళ్ళే దారిలోనే జెయిలున్నది. ఆ జెయిల్ కిటికీల వేపు పరకాయించి చూస్తాడు. ఆ లోపల ఉన్నవాళ్ళలో ఎవడు ఏ నేరానికి శిక్షింప బడ్డాడో అని మనస్సులో ఆలోచించు కుంటూ వుంటాడు.

ఈ విధంగా క్రమంగా రోజురోజూ బాబూలాల్ మనస్సుకి ఎక్కుతున్న బరువు భరింప రానిదైంది.

పోనీ, సరాసరి ఆ పెద్ద రైతు వద్దకు పోయి, "అయ్యా, నా వల్ల ఈ పొరపాటు వచ్చింది, మన్నించండి," అని చెప్పేదామా అంటే ధైర్యం చాలలేదు. అతని సరకు నుండి అన్యాయంగా తీసిన దొంగసొమ్ము తన వద్ద ఉంచుకోడానికా మనస్సు లేదు. ఏం చేసేది? ఇటువంటి అవస్థలో వుంటున్న బాబూలాల్‌కు తప్పించుకోగల ఒక చిన్న వుపాయం తట్టింది.

పదిహేను రోజుల కొకసారి పెద్ద రైతు బియ్యం మూటలు పట్టించుకుని ఈ పిండి మరకు మామూలుగా వస్తూనే ఉన్నాడు. అంటే, ఈ క్షణం వరకు ఆయనకు బాబూలాల్ పైన ఎటువంటి అనుమానమూ కలగ లేదన్న మాట. కనుక, మళ్ళీసారి నుంచీ తన పదోవంతు మాత్రమే కూలి తీసుకోడానికి బాబూలాల్ నిశ్చయం చేసుకొన్నాడు.





అసలు ఏమీ తీసుకోకుండా వుందామా అని కూడా అనుకున్నాడు. కానైతే, పిండి మరీ హెచ్చుగా కనబడితే, గభీమని తేడా తెలిసిపోయి, తను పట్టుబడిపోవచ్చు.

కనుక బాబూలాల్ నాటినుంచీ ఏం చేస్తూవచ్చాడూ?—క్రమంగా, ఒక్కొక్క మాటు,—లోగడ తను ఎంత ఎక్కువ తీసుకొని వున్నాడో అంతా పూర్తి అయ్యే వరకూ—తగ్గించుకుంటూ వచ్చాడు.

ఇలా చెయ్యడం వల్ల రైతుకు తను రుణపడీ వుండడు, ఆయనకు క్షమాపణ చెప్పుకోవలిసిన అవసరమూ లేదు, అని బాబూలాల్ వుద్దేశం. లెక్కలన్నీ తీసి చూచి, రైతు తాలూకు సరకు ఎంత హెచ్చు తీసుకున్నదీ తెలుసుకుని, అంతా బాకీ తీరిపోయే వరకూ తన కూలీ తగ్గించుకుంటూ వచ్చాడు. ఇప్పుడేదో మనసు తేలికపడిందనుకొంటున్నాడుగాని, ఇంత కాలం నుండీ అక్కడ రయితు పొలంలో ఏం జరుగుతున్నదో తెలిస్తే, బాబూలాల్ మనస్సులో చిచ్చు పుట్టి వుండేది.

రయితు భార్య బలే తెలివయింది. మర నుంచి వచ్చే పిండిని ఆమె చాలాసార్లు కొల్చి చూసుకుంది. తగ్గడం కూడా కనిపెట్టింది. చివరకు ఉండబట్టలేక తన అనుమానం భర్తకు చెప్పింది.

"అబ్బే, వాడలాంటి వాడు కాదు. వాడి తండ్రినీ తాతనూ కూడా నెనెరుగుదును," అన్నాడు రైతు, నవ్వుతూ.

అందు కామె, "సరే, న్యాయస్థుడైతే మంచిదే, కాని మనం పంపే బియ్యం, వచ్చే పిండీ సరిచూచుకుంటే యిబ్బంది లేదుగా?" అన్నది. అలాగే కానిమ్మన్నాడు రయితు.

ఈసారి బియ్యం కొలిచి పంపి, పిండి రాగానే కొలిచి చూస్తే తక్కువకు బదులు హెచ్చుగావుంది. ఆమెకు ఆశ్చర్యం వేసింది. రయితు మరింత పకపక నవ్వుతూ,

"నే చెప్పలే ?" అన్నాడు. "మళ్ళీమాటు చూస్తేగాని నిజం తేలదు," అంది భార్య.

అక్కడ—బాబూలాల్, తను ఎచ్చు తగ్గు లేమీ తీసికోకపోవడం వల్ల అంతా సర్దుకు పోయిందని తలిచి, మనస్సులో హాయిగా వుంటున్నాడు. ఇప్పుడు పిండి ఎచ్చు తగ్గులు లేక సరికి సరిరావటంతో రైతుకూ భార్యకూ కూడా సందేహం పట్టుకుంది.

ఆనాడు రయితు భోజన మవుతుండగా భార్యతో, "నువ్వు చెప్పినట్టు ముందంతా తక్కువ రావడం, తరువాత ఎక్కువ రావడం, ఇప్పుడు సరీగా రావడం చూడగా చిత్రంగా వుంది. ఆ బాబూలాల్ తూకపు రాళ్ళలో ఏదైనా పొరపాటుందేమో! రేపాక సారి పోయి చూసివస్తా. ఇలాంటి పొరపాట్లు సాగనివ్వకూడదు," అని చెప్పాడు.

"అదే నేననే మాట. మూడు నాలుగు సార్లు పిండి తగ్గింది. రెండుసార్లు ఎచ్చు రావటం మీరూ కళ్ళారా చూశారు. ఇప్పుడు సరిగ్గా ఉండటమేమిటి? నేను ఊరికే చెప్పలేదు," అన్నది భార్య.

మరునా డుదయమే పెద్దరైతు బయల్దేరి మరకు వెళ్ళాడు. ఆయన్ని చూస్తూనే బాబూలాల్‌కు కంగారు పుట్టింది. ముఖం దించుకు పోయింది. దణ్ణం కూడా సరిగ్గా పెట్టలేక పోయాడు.



"ఎందుకు వచ్చానో తెలుసుకదూ బాబూలాల్?" అన్నాడు రైతు.

బాబూలాల్ బదులు చెప్పలేదు.

"పోయిన తడవ మా బియ్యం కొలిచావా?" అని అడిగాడు రైతు.

"కొలిచానండి," అన్నాడు, హీనస్వరంతో బాబూలాల్.

"మరి, పిండి ఎక్కువుందేం? మాకు నువ్వు ఉత్తనే విసిరిపెట్టక్కర్లేదని మొదటే చెప్పాగా?" అన్నాడు రయితు.

బాబూలాల్ ముఖం పాలిపోయింది.

"ఇదిగో, బాబూలాల్!—మేం నీతండ్రి, తాతల నాటినుంచీ మీ మరలోనే విసిరించుకుంటున్నాం. ఏమిటి వచ్చిన చిక్కు, నిజం చెప్పు నాతో," అన్నాడు రయితు.

చితికిపోయిన కంఠస్వరముతో—"బాబూ! ధనికుడనవుదామని దొంగపని చేశాను. తరువాత చేసిన తప్పు దిద్దుకోడానికి ప్రయత్నించాను. మీ సరకులోనించే తీసుకున్న దొంగసొమ్ము అంతా అదుగో, ఆ కొట్టులో తట్టలో వుంది. అది మీకు వప్పగించే వరకూ నాకు మనశ్శాంతి లేదు," అని విలపించాడు, బాబూలాల్.

అందుకు రయితు, "పిచ్చివాడా!—సరకు పోయినందుకు ఎవడేడిశాడు? గతం పోనీ. దీంతో నువ్వొక పాఠం నేర్చుకున్నట్టయింది. ఈ సంగతి నా భార్య ఒక్కతికే తెలుసు. ఆమె ఎవరికీ చెప్పదులే. భయపడకు. ఇందువల్ల నీ పట్ల నా నమ్మకం తగ్గిందని మాత్రం అనుకోకు," అంటూ ధైర్యం చెప్పి మందలించాడు.

తన వద్ద నిలవ ఉండిపోయిన బియ్యం పిండి పట్టించి రయితుకు పంపించి వేశాడు బాబూలాల్. నాటినుంచీ, గుండె నిబ్బరంతో బాబూలాల్ మళ్ళీ తలెత్తుకు తిరగసాగాడు. ఇప్పుడు ప్రార్థన మందిరంలో నీతివాక్యం చూచినప్పుడు అతనికి మనసులో బెరుకుగా ఉండటం లేదు.






# వనదేవత

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, దేవతలు సైతం బుద్ధి నిలకడ లేని వారుగా ఉంటారు గదా, అటువంటప్పుడు నీ దృఢ నిర్ణయం ఎంత గొప్ప దనవచ్చు! దేవతలు చపల చిత్తులన టానికి ఉదాహరణగా నీకు కేతకీ వనదేవత కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

పూర్వం చింతామణీదేశపు రాజుకు శూర సేనుడనే కుమారు డుండే వాడు. అతను సకల విద్యలూ పూర్తి చేసి యుక్త వయస్కుడు కాగానే అతని తల్లి దండ్రులు అతని పెళ్ళి విషయం ఆలోచించారు. శూర సేను డదివరకే కేతకీ నగర రాజ కుమార్తె అయిన సునందిని అనే దాన్ని ప్రేమించి పెళ్ళాడ గోరి ఉన్నాడు.

---

## బేతాళ కథలు

---

అ సమయంలోనే సునందిని స్వయంవరం ఏర్పాటైనట్టు వార్త వచ్చింది. ఆ స్వయంవరానికి శూరసేనుడు కూడా బయలుదేరాడు. అతను కేతకీ నగరం సమీపంలో ఉన్న కేతకీ వనం ప్రవేశించి, తన పరివారం కన్న ముందుగా గుర్రం మీద వెళ్ళుతూండగా, మొగలి పొదల మధ్యగా అతని దారికి అడ్డంగా ఒక దేవతలాటి స్త్రీ ప్రత్యక్షమయింది.

"ఎవరు మీరు? నాకు దారి ఇవ్వండి," అని శూరసేను డడిగాడు.

దాని కా స్త్రీ, అతన్ని తేరిపార చూస్తూ, "మానవుల్లో నీ అంత సౌందర్య వంతుడుంటాడని నేను ఊహించనైనా ఊహించలేదు. నాకు నీ పైన మోహం కలిగింది. నన్ను గాంధర్వ వివాహం చేసుకుని, నాతో బాటు ఎప్పటికీ ఈ వనంలోనే ఉండిపో. నీకు దేవత్వం ఇస్తాను," అన్నది.

"నాకు మానవ జన్మ చాలు, మానవ సుఖాలు చాలు. దేవతలకూ, మానవులకూ పొత్తు కుదరదు. ఇక దేవత్వం మాటకు వస్తే, ఒక రిప్పించే దేవత్వం అదెంత కాలం నిలుస్తుంది? స్వశక్తి చేత నేనే సంపాదించుకుంటాను," అని శూరసేనుడు పెడసరంగా జవాబు చెప్పాడు. వనదేవత ఎంత బతిమాలినా శూరసేనుడి మనసు మారలేదు.



చివర కామె అగ్రహించి, "నీవు ఎవతెను ప్రేమించి నన్ను తృణీకరించావో ఆ స్త్రీని తాకగానే గుర్రాని వైపోతావు. ఇదే నీకు నా శాపం," అని మాయమయింది.

వన దేవత పెట్టిన శాపం వినగానే శూరసేనుడు హతాశు డైపోయినాడు. అతను స్వయంవరానికి వెళ్ళే ప్రయత్నం మానుకుని స్వదేశానికి తిరిగి పోదామని కూడా అనుకున్నాడు. కాని అందుకు కారణం ఏమని చెప్పాలి? అతను ఏమి చెయ్యటానికీ తోచక అక్కడే నిలబడి ఉండగా అతని పరివారం వచ్చి అతన్ని చేరుకున్నారు. వనదేవతను గురించి వారితో చెప్పటానికే అతనికి బుద్ధి పుట్టలేదు. అందుచేత అతను వారి వెంట ముందుకు సాగి కేతకీ నగరం చేరుకున్నాడు. స్వయంవరానికి వచ్చిన ఇతర రాజకుమారులతో బాటు అతనికి విడిది ఏర్పాటుచేసి, అతిథి సత్కారాలన్నీ జరిపారు.

స్వయంవరం నాడు శూరసేనుడు సునందినిని వరించి వచ్చిన వారితోబాటు కూర్చోక, చూడ వచ్చిన అతిథుల మధ్య కూర్చున్నాడు. అయినప్పటికీ రాజకుమార్తె సునందిని అందరినీ వదిలేసి, అతని వద్దకు వచ్చి అతని మెడలోనే పూల మాల వేసి, భర్తగా వరించింది.



ఇప్పుడు శూరసేనుడికి పెద్ద సమస్య వచ్చిపడింది. అతను సునందినితో ఏకాంతంగా మాట్లాడాలని కోరాడు. అందుకు తగిన ఏర్పాటు చేశారు. అప్పుడతను ఆమెతో కేతకీ వనదేవత వృత్తాంత మంతా చెప్పి, "మనకు జరిగే పెళ్ళి తప్పక నిరర్థక మవుతుంది. అందుచేత వివాహం జరిగేలోపుగా ఏదో ఒక మిషపెట్టి మరొకరిని భర్తగా ఎన్నుకోవటం మంచిది," అన్నాడు.

"నేను మిమ్మల్ని భర్తగా ఏనాడో ఎన్నుకున్నాను. భవిష్యత్తులో ఏమి జరిగేదీ ఎవరికీ తెలియదుగద. ఒకవేళ తెలిసినంత మాత్రాన మనస్సులు మారిపోతాయా?



పోయారు. సునందిని తల్లి దండ్రులకూ, బంధువులకూ తీరని తలవంపు జరిగింది.

సునందిని గుర్రంగా మారిన తన భర్తతో, "మనం ఇక్కడ ఉండటం భావ్యం కాదు. మీ దేశం వెళ్ళిపోదాం పదండి," అన్నది.

వారు కేతకీ వనం ప్రవేశించి కొంత దూరం వెళ్ళేసరికి, దారికి అడ్డంగా వనదేవత ప్రత్యక్షమై, "ఎవరు నీవు? ఈ గుర్రాన్ని వెంట బెట్టుకుని ఎక్కడికి పోతున్నావు?" అని సునందినిని అడిగింది.

దాని కామె, "ఇది గుర్రంకాదు, నా భర్త. ఎవరో దేవత కుటిల బుద్ధితో ఈయనను ఇలా కమ్మని శపించింది," అన్నది.

"నేనే ఆ దేవతను. నేనతన్ని మోహించి నన్ను పెళ్ళాడమన్నాను, దైవత్వం ఇస్తానన్నాను. నీపై గల మోహం చేత నన్ను తృణీకరించి, అందుకు తగిన శిక్ష పొందాడు," అన్నది వనదేవత.

సునందిని వనదేవత కాళ్ళపై పడి, "తల్లీ, నా భర్తను తిరిగి మనిషిగా చెయ్యి. నేను నీ సుఖాని కేమీ అడ్డురాను. యావజ్జీవం నీ దాసిగా ఉండి ఊడిగం చేస్తాను," అని ప్రాధేయపడింది.

"అదేమీ వీలుకాదు. నే నతనికి గుర్రం రూపు ఇచ్చినది నీ కారణంగానే. నీ శుశ్రూ

ఏడాది మాత్రమే ఆయుర్దాయం గల సత్యవంతుణ్ణి సావిత్రి తెలిసి పెళ్ళాడలేదా? రాబోయే దానికి భయపడి ఆత్మద్రోహం చేసుకుని, మరొకరిని వరించటం నాకు శక్యం కాదు. ఏమైతే అదే అవుతుంది," అని సునందిని అతనితో అన్నది.

వారిద్దరికీ శాస్త్రోక్తంగా వివాహం ప్రారంభమయింది. వివాహసమయంలో దంపతులు పాణిగ్రహణం చెయ్యగానే శూరసేనుడు పెళ్ళి పీటల మీదనే గుర్రంగా మారి పోయాడు. పెళ్ళితంతు యావత్తూ రసాభాస అయింది. అతిథు లందరూ అప్పటికప్పుడే ప్రయాణమై ఎవరి దారిన వారు వెళ్ళి

షలు దేవతనైన నా కెందుకు?" అన్నది వనదేవత.

"అలా అయితే నన్నే గుర్రంగా మార్చి, నీ కసి తీర్చుకుని ఆయనకు మానవ రూపం ఇచ్చెయ్యి. అప్పుడాయన నిన్ను ప్రేమించ టానికి నేను అంతరాయంగా ఉండను," అని సునందిని వేడుకున్నది.

వనదేవత ఒక్క క్షణం ఆలోచించి, శూరసేనుడికి మానవ రూపం ఇచ్చి అంత ర్థానమై పోయింది. అటు తరవాత వారికి వనదేవత కనిపించనే లేదు. శూరసేనుడు తన భార్యతో సహా స్వదేశానికి తిరిగి వచ్చి, ఆమెతో కలకాలం సుఖంగా జీవించాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, వన దేవత తన మనస్సును ఎందుకు మార్చు కున్నది? సునందినిని గుర్రంగా మార్చి, శూరసేనుణ్ణి మనిషిని చేసినట్టయితే వన దేవత కోరిక ఫలించి ఉండేదేమో గదా! అలా చేయక శూరసేనుణ్ణి మనిషిగా మార్చి తన దారిన తాను ఎందుకు వెళ్ళిపోయింది? అతని పై నిజమైన మోహం లేకనా? లేక సునందినిని చూసి జాలికలిగా? ఈ సందే హానికి సరి అయిన సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "వనదేవత శూరసేనుణ్ణి విడిచి పుచ్చటానికి కారణం అతని పై తగినంత మోహం లేకపోవటమూ కాదు, సునందినిని చూసి జాలీకాదు. ఒక మానవ స్త్రీ తాను ప్రేమించిన వాడి క్షేమం కోసం ఎంత త్యాగమైనా చేయటానికి సిద్ధంగా ఉండటం చూసి, దేవత అయిన తాను అంతకంటె తక్కువగా ప్రవర్తించటం భావ్యం కాదనుకుని జాత్యభిమానం కొద్దీ శూరసేనుణ్ణి విడిచిపుచ్చింది," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగ గానే భేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# జలదానం

వింధ్య ప్రాంతంలో ఒక కాపు ఉండేవాడు. అతడికి గంగ అని ఒక కూతు రుండేది. ఆమె పసితనం నుంచి కూడా గొర్రెలనూ, మేకలనూ కాస్తూ, అవి మేత కోసం తిరిగే స్థలాలన్నీ తిరుగుతూ ఉండేది.

ఒకనాడు గంగకు ఒక విచిత్రమైన మొక్క కనిపించింది. అది పశువులు తిరుగుతూ మేత మేసే చోట ఉన్నది. అక్కడ ఉంటే దానికి క్షేమం లేదని, గంగ దాన్ని అక్కడి నుంచి తీసి, కొంచెం ఎత్తుగా, రాళ్ళమయంగా ఉండే చోట నాటింది. ఆమె దానికి ప్రతి రోజూ, కొద్ది దూరాన ఉన్న చెరువు నుంచి నీరు తెచ్చి పోస్తూ వచ్చింది.

గంగ పోషణలో ఆ మొక్క ఏపుగా ఎదిగి వచ్చి, కొద్ది కాలంలోనే మహావృక్షమయింది. దాని కింద నీడ చల్లగా ఉండేది. దాని కొమ్మలలో ఎన్నో పక్షులు నివాసాలు ఏర్పరచుకున్నాయి. గంగ తన గొర్రెలనూ మేకలనూ ఆ ప్రాంతానికే తోలుకు వచ్చి, ఎండవేళ ఆ చెట్టు కిందనే విశ్రాంతి తీసుకునేది. ఎండ మరీ జాస్తిగా ఉన్నప్పుడు ఆ చుట్టుపక్కల మేసే పశువులన్నీ ఆ చెట్టు నీడనే పడుకునేవి.

గంగ నాటిన చెట్టుకు కొద్ది దూరంలో ఉండే చెరువు ఆ చుట్టుపక్కల ఉండే అనేక గ్రామాలకు జలాధారం. వేసవిలో కూడా అందులో అంతో ఇంతో నీరుండేది. వేసవి రాగానే అక్కడి వాళ్ళు ఆ చెరువులో ప్రతులు తవ్వి, నీటిని ప్రాణంతో సమంగా కాపాడుకుంటూ ఉండేవారు. ఎందుకంటే, ఆ చెరువు ఎండిపోతే వారికి మరొక జలాధారమేమీ అనేక మైళ్ళ దూరంలో లేదు.

ఇలా ఉండగా ఒక ఏడు వర్షాలు బాగా పడలేదు. అందుచేత ఆ చెరువు ప్రతి ఏడూ నిండి నట్టుగా నిండ లేదు. తరవాత వేసవి

బి. నాగరాజు

చాలా తీవ్రంగా వచ్చింది. చెరువు కాస్తా ఎండి పోయింది. చెట్లూ, చేమలూ మాడి పోసాగాయి. గరికె కూడా ఎండిపోయి పశువులకు మేత దొరకని స్థితి ఏర్పడింది. జనం నీటి కోసం అల్లాడసాగారు. కొందరు దూర ప్రాంతాలకు వెళ్ళిపోయారు.

ఒకనాటి మధ్యాన్నం వేళ గంగ తాను నాటిన చెట్టు వద్దకు వచ్చింది. తాను కష్టపడి పెంచిన ఆ చెట్టు మాడిపోతుందేమోనని ఆమెకు బెంగ. కాని ఆ చెట్టు మాత్రం చెక్కు చెదరలేదు. దాని ఆకులు దట్టంగా నవనవలాడుతూ ఉన్నాయి. చెట్టునీడ చల్లగా, ప్రాణం లేచి వచ్చేలాగున్నది. దాహంతో తపించిపోతున్న గంగ దాని నీడన పడుకుని, తాను చావటం తథ్యమనుకున్నది. ఆమె ఆ రోజు నీటిచుక్క ఏమిటో ఎరగదు. దాహంతో నాలుక ఈడ్చుకుపోతున్నది. తన చెట్టు నీడనే ప్రాణాలు విడుద్దామన్న కోరికతో ఆమె కాళ్ళీడ్చుకుంటూ అక్కడికి వచ్చింది. అంత దూరంలో చెరువు పాడి ఆరిపోయి బావురుమంటున్నది.

అంతలోనే గంగకు ఒక భ్రమలాటిది కలిగింది. చెట్టుమానులో ఒక మనిషి ముఖం లాటిది పొడగట్టి, "గంగా, నాకు చాలాకాలం నీరు పోశావు. నీకు నీరిస్తాను.




నా వేరు ఒకటి పెకలించావంటే నీకు నీరు దొరుకుతుంది. ఆ నీరు తాగి వేరు మళ్ళీ యథాస్థానంలో పెట్టెయ్యి. ఈ రహస్యం ఎవరికీ చెప్పకు!" అన్నది.

గంగ తన కళ్ళనూ చెవులనూ నమ్మలేకపోయింది. ఆమె లేచి అటూ ఇటూ చూసే సరికి ఒక రాతి మీదుగా భూమిలోకి దిగబడిన వేరొకటి కనిపించింది. ఆమె తన శక్తినంతా వినియోగించి దానిని పైకి లాగింది. వెంటనే వేరు దిగబడిన రంధ్రం నుంచి నీటిధార పైకి చిమ్మింది. గంగ దాన్ని కడుపారా తాగి, వేరు మళ్ళీ యథాస్థానంలో పెట్టేసింది.

అంతలోనే అక్కడికి ఒక ముసలివాడు వచ్చి, దాహమంటూ శోషతో పడిపోయాడు. వాడికి నీ రివ్వటాని కని గంగ వేరును మళ్ళీ పైకి లాగింది. ఆ సమయంలో, "గంగా, వేరు తీస్తే నీ ప్రాణాలు పోతాయి!" అని వెనకటి కంఠమే బెదిరించింది.

ఈ బెదిరింపుకు భయపడక గంగ వేరు పైకి లాగి, పైకి చిమ్మిన నీటిధార వద్దకు వృద్ధుణ్ణి చేర్చింది. ముసలివాడు ఆ నీరు చూసి పరమానందం చెందాడు. ఆ నీరు తాగగానే అతనికి ప్రాణం లేచి వచ్చింది.

గంగ ఆ వేరును తిరిగి యథాస్థానంలో పెట్టక ముసలివాడితో, "తాతా, ఇక్కడ నీరున్నదని చుట్టు పక్కల అందరికీ తెలియజెయ్యి. నేను వెళ్ళటానికి వీలు లేదు!" అన్నది. ముసలివాడు బయలుదేరి వెళ్ళిపోయాడు.

గంగ ఆ నీటి ధార కేసే చూస్తూ నిలబడి పోయింది. ఆ నీరు ఆగకుండా అలాగే పైకి వచ్చి తిరిగి కింద పడి చెరువుకేసి పోసాగింది. ఆమె చెట్టు కేసి తిరిగి. "నీ మాట వినకుండా ప్రజల ప్రాణాలు కాపాడటానికి ఈ పని చేశాను అందరూ బతికే పక్షంలో నేను ఒక్కతెను పోయినా ఫరవాలేదు. నా ప్రాణం బలి తీసుకో!" అన్నది.

చెట్టు మానులో తిరిగి వెనకటి ముఖమే ప్రత్యక్ష మయింది. "నిన్ను పరీక్ష చెయ్యటాని కలా అన్నాను గాని నీ ప్రాణం ఎందుకు తీస్తాను, గంగా? నీవు నాకు ఒకప్పుడు జలదానం చేశావు గనక అందుకు ప్రతి ఫలంగా ఈ చెరువు నింపుతాను. ఇక ఎన్నడూ ఈ ప్రాంతాన నీటి ఎద్దడి లేకుండా చేస్తాను," అని చెప్పి ఆ ముఖం కాస్తా మాయమయింది.

ఆ ప్రకారమే చెట్టు కింది జలతో చెరువు చాలా వరకు నిండింది. దానితో ఆ ప్రాంతాల ఉండే మనుషుల ప్రాణాలూ, పశువుల ప్రాణాలూ దక్కాయి.





# ఎసరు మసళ్ళు

ఒక గ్రామంలో రంగయ్యా, రంగమ్మా అని ఇద్దరు దంపతు లుండేవారు. రంగయ్య వట్టి సోమరి. ఏ పనీ చేతకాదు. ఇంత తిండి తిని ఊరంతా తిరిగి వచ్చేవాడు. గయ్యాళి భార్య రంగమ్మ చేత తిట్లు తిని దులిపేసు కుంటూ ఉండే వాడు.

ఒకనాడు ఇంట్లో గింజలు లేవు. రంగమ్మ వంట చెయ్యకుండా కూర్చుంది. రంగయ్య తిండి వేళకు ఇంటికి వచ్చి అన్నం పెట్ట మన్నాడు. రంగమ్మ మొగుణ్ణి నానా మాటలూ అన్నది. "నీకు ఏ పనీ చేత కాదు. నేనీ సంసారం ఎంతకాలం ఈదగలను? ఇక నుంచీ నీవు ఏ విధంగా నైనా సరే గింజలు తేవాలి, నేను వండాలి. ఇంకో విధంగా తేలేక పోతే దొంగతనమైనా చేసి గింజలు తీసుకురా!" అన్నది.

రంగయ్య ఈ మాటలు విని కొయ్యబారి పోయి, "నన్ను దొంగతనం చెయ్యమంటావా? అదెంత తప్పు పని! పైగా, నాకు దొంగతనం చెయ్యటం చేత కాదు కూడా," అన్నాడు.

"అదంతా కుదరదు. నేను చెప్పినట్టు చేస్తే చెయ్యి, లేకపోతే ఇదుగో చీపురుకట్ట!" అని రంగమ్మ మూలనున్న చీపురుకట్ట తీసి మొగుణ్ణి బెదిరించింది.

రంగయ్య భయపడి పోయి, "ఎక్కడ దొంగతనం చెయ్యాలో, ఎలా చెయ్యాలో కూడా నువ్వే చెప్పు," అన్నాడు.

"జాము పొద్దెక్కినాక జనం పొలాల మీద ఉంటారు. అప్పుడు నీవు ఏదో ఇంట జొరబడి గింజలు ఎత్తుకురా," అన్నది రంగమ్మ. రంగయ్య అలాగే చేయసాగాడు. అతను ఎంతకూ రాకపోతే రంగమ్మ వీధి లోకి వచ్చి, "ఎసరు మసళ్ళు!" అని కేక పెట్టేది. రంగయ్య గింజలు దొంగిలించి వచ్చేసేవాడు.

పి. సులోచన

అతను ఒకరోజు దొంగతనం చేసిన ఇంట్లో మరొక రోజు చేసేవాడు కాడు. తన కా రోజు అవసరం అయిన తిండి గింజలు తప్ప, ఆ ఇంట్లో కనిపించిన మరే విలువైన వస్తువైనా దొంగిలించేవాడు కాడు.

ఇలా కొన్ని రోజులు జరిగాక గ్రామంలో తిండిగింజల దొంగతనం జరుగుతున్నట్టు గ్రామస్థులు పసికట్టారు. దొంగను పట్టటానికి వాళ్ళు నిశ్చయించుకుని, తగు సన్నాహంలో కాపు వేసి వున్నారు.

ఒకనాడు దొంగతనానికి రంగయ్య గ్రామ పెద్ద ఇంట జొరబడ్డాడు. తిండిగింజల దొంగ కోసం కాపలా వేసిన గ్రామస్తులు వెంటనే అతన్ని పట్టుకుని, ఇంటి ముందు గుంజకు కట్టేశారు.

తన భర్త ఎంతకూ గింజలు తీసుకుని రాకపోయేటప్పటికి రంగమ్మ వీధిలోకి వచ్చి, "ఎసరు మసళ్ళు!" అని పెద్దగా పొలికేక పెట్టింది.

ఆ కేక వింటూనే రంగయ్య గొంతెత్తి, "గుంజకు బందిళ్ళు!" అని మారు పొలి కేక పెట్టాడు.

గ్రామపెద్ద ఇదేమీ అర్థంకాక, "ఏమిట్రా ఇదీ?" అని అడిగాడు.

రంగయ్య జరిగిన దంతా గ్రామపెద్దకు చెప్పి బోరున ఏడ్చాడు. అక్కడ చేరిన గ్రామస్తు లంతా పొట్టలు చెక్కలయేలా నవ్వుకున్నారు.

గ్రామపెద్ద రంగమ్మను పిలిచి, "నీ మొగుణ్ణి పనీపాటా చేసుకునేటందుకు పురి కొల్పటానికి బదులుగా, దొంగతనానికి పురి కొల్పుతావా?" అని గట్టిగా చివాట్లుపెట్టి, రంగయ్యను కూడా కష్టపడి పనిచేసుకోమని హెచ్చరించి, వదిలిపెట్టాడు.

అది మొదలు రంగయ్య బుద్ధి తెచ్చుకుని పదిమందితో పాటు తాను కూడా కూలీ నాలీ చేసుకుంటూ గౌరవంగా బ్రతకటం నేర్చుకున్నాడు.






# పామర పండితులు

పూర్వం మణిపుర రాజ్యాన్ని వజ్రనాభుడనే రాజు పాలించే వాడు. ఆయన పరిపాలన ఆదర్శప్రాయమైనదిగా ప్రసిద్ధి కెక్కింది. ఆయన తన రాజ్యంలో శాంతిని కాపాడటమే గాక, ప్రజలకు ఎలాటి ఉపద్రవాలూ, భయాలూ లేకుండా తగిన ఏర్పాట్లు చెయ్యటం చేత ప్రజలందరూ తెలివి తేటలు గల వారయ్యారు. మరే రాజ్యంలోనూ తన ప్రజలంత తెలివి గల వారుండ రన్నది ఆయనకు ఎంతో గర్వ కారణంగా ఉండేది.

ఒకప్పుడు మణిపురానికి జయపుర రాజైన శతధ్వజుడు తన మిత్రుడైన వజ్రనాభుణ్ణి చూడ వచ్చాడు. వజ్రనాభుడు తన శత్రువులను తల ఎత్తకుండా చెయ్యటమే గాక తన ప్రజలు సుఖపడటానికి అనేకమైన ఏర్పాట్లు చేసినట్టు విని; ఈ వార్తలు వట్టి గాలి కబుర్లో, ఇందులో ఏమైనా నిజం ఉన్నదో స్వయంగా చూతామని ఆయన బయలుదేరి వచ్చాడు. వజ్రనాభుడు తన మిత్రుడికి చక్కగా అతిథి సత్కారం చేసి కబుర్లు చెప్పుకోవటంలో శతధ్వజుడు, "నీ పరిపాలన గురించి గొప్పగా విన్నాను. అందుకు నిదర్శన మేమిటి?" అని అడిగాడు.

"అందుకు నా ప్రజలే నిదర్శనం. వారందరూ మంచి తెలివి తేటలు గల వారు. ప్రజల తెలివిని పెంచేదే సరి అయిన పరిపాలన అని నా అభిప్రాయం," అన్నాడు వజ్రనాభుడు.

"పరిపాలన ఎంత బాగా ఉన్నప్పటికీ ప్రజలందరూ తెలివి గల వాళ్ళుగా ఉండటం అసంభవం. అది ప్రకృతి విరుద్ధం. మనుష్యుల తెలివితేటల్లో హెచ్చుతగ్గులు పుట్టుకతోనే వస్తాయి. కొందరు మందమతులుంటారు. కొందరు మేధావులుంటారు.

ఆర్. కోటేశ్వరరావు



దానికి రాజేం చెయ్యగలడు?" అన్నాడు శతధ్వజుడు.

"అది అసమర్థు లనవలసిన మాట. కావలిస్తే నా ప్రజల తెలివితేటలు పరీక్ష చేసుకో," అన్నాడు వజ్రనాభుడు.

"అలాగే పరీక్షింతాం. పందెం వెయ్యి; నీ ప్రజలలో తెలివి తక్కువ వాళ్ళుంటే నా రాజ్యం నీ కిస్తాను. వారి తెలివి తేటల్లో హెచ్చు తగ్గులుంటే నీ రాజ్యం నా కిచ్చెయ్యి," అన్నాడు శతధ్వజుడు.

"పందెం నాకు ప్రధానం కాదు. అయినా నీవు కోరితే ఒప్పుకుంటాను. ముందు పరీక్షకు బయలుదేరుదాం, పద!" అన్నాడు వజ్రనాభుడు. ఇద్దరూ తమ మంత్రులతోసహా మారువేషాలు వేసుకుని, నగరం దాటి పాటకపు జనులూ, పేదవాళ్ళూ ఉండే ఇళ్ళ కేసి వెళ్ళారు. ఒక కుటీరం ముందు నిలబడిన గొర్రెలకాపరిని చూసి శతధ్వజుడు, "ఏమోయ్, నిన్ను కొన్ని ప్రశ్నలు వేస్తాను, సమాధానం చెబుతావా?" అని అడిగాడు.

"అడగండి, బాబూ! తెలిస్తే చెబుతాను," అన్నాడు గొర్రెలకాపరి.

"అన్నిటికన్నా ప్రకాశవంతమైన దేది?" అని శతధ్వజు డడిగాడు.

"సూర్యుడు," అన్నాడు గొర్రెలకాపరి.

"నీటిలో శ్రేష్ఠమైన నీరేది?"

"గంగాజలం."

"ఎటువంటి నిద్ర మేలైనది?"

"రాత్రి పడుకుంటే తెల్లవారుజామున మెలకువ వచ్చేది మేలైన నిద్ర."

"అక్షయపాత్ర మంటే ఏమిటి?"

"ఫలితం గల శ్రమ."

"పువ్వులలో గొప్పది ఏది?"

"లక్ష్మికి నివాసమైన తామరపువ్వు."

ఈ సమాధానాలు విని శతధ్వజుడు, "బాగానే చెప్పావు," అంటూ గొర్రెలకాపరి చేతిలో కొన్ని డబ్బులు పెట్టాడు. ఈ సమయంలో వికవికా నవ్వుకుంటూ గొర్రెల

కాపరి కొడుకు, ఐదేళ్ళవాడు, కుటీరంలో నుంచి బయటికి వచ్చాడు.

"ఎందుకురా నవ్వుతావూ?" అని శత ధ్వజుడు వాణ్ణి అడిగాడు.

"మీ రడిగిన దానికి మా అయ్య నోటికి వచ్చినట్టు చెప్పాడు. అది విని మీరు సంతోషించారు," అన్నాడు కుఱ్రవాడు.

"అయితే సరి అయిన సమాధానాలు నీవు చెప్పు!" అన్నాడు శతధ్వజుడు.

"అన్నిటి కన్నా ప్రకాశవంతమైనవి మా అమ్మ కళ్ళు. ఆకాశం నుంచి పడేదే మంచి నీరు. కష్టపడే వాడి నిద్రే మేలైన నిద్ర. మా అమ్మ చెయ్యే అక్షయపాత్ర. దేవుడికి పూజ చేసినదే గొప్ప పువ్వు," అని కుఱ్ర వాడు గబగబా చెప్పాడు.

శతధ్వజుడు వాడి తెలివికి ఆశ్చర్యపడి, వాడి చేతిలో రెట్టింపు డబ్బులు పెట్టుతూం డగా, కుటీరంలో నుంచి విరగబడి నవ్వుతూ కాపరి భార్య వచ్చింది. ఆమె శతధ్వజుడితో, "నవ్వినందుకు మన్నించండి. ఆ చిన్న వెధవ తెలిసీ తెలియక చెప్పిన మాటలకే సంతోషించిన మీ అమాయకత్వానికి నవ్వొచ్చింది," అన్నది.

"అంతకంటె సరిగా నీవు సమాధానాలు చెప్పగలవా?" అన్నాడు శతధ్వజుడు విస్మయంతో.



"ఎందుకు చెప్పలేను, బాబూ? అద్దంలో కనిపించే ప్రకాశమే శ్రేష్ఠమైన ప్రకాశం. అన్ని బాధలను కడిగే కన్నీరే ఉత్తమమైన నీరు. ఎంత చిన్న అలికిడికైనా మెలకువ వచ్చేదే మంచి నిద్ర. భూమాతే అక్షయ పాత్ర. భర్త తెచ్చి భార్య కిచ్చేదే శ్రేష్ఠమైన పువ్వు," అని గొర్రెలకాపరి భార్య అన్నది.

ఆమె సమాధానాలకు ఆనందపడి శత ధ్వజుడు ఆమె కింకా హెచ్చు డబ్బిస్తూ ఉండగా, గొర్రెలకాపరి ముసలి తల్లి నవ్వుతూ బయటి కొచ్చింది. "వీళ్ళందరూ మీ ప్రశ్నలకు తప్పుడు సమాధానాలే చెప్పారు," అన్న దామె.

"సరి అయిన సమాధానాలు నీవు చెబు తావా?" అని శతధ్వజు డామె నడిగాడు.

"చెబుతాను వినండి. కటిక చీకటిలో వెలిగే చిన్న దీపం యొక్క ప్రకాశమే ప్రకాశం. దాహంతో నోరెండి పోయేటప్పుడు తాగిన నీరే నీరు. ఆరోగ్యవంతుడికి పట్టే నిద్రే నిద్ర. మనిషి బుద్ధిని మించిన అక్షయపాత్ర మరి లేదు. ఎండిన తరవాత కూడా ఏళ్ళతరబడి ఉపయోగపడే పత్తి పువ్వే పువ్వు," అని గొర్రెలకాపరి తల్లి అన్నది. ఆమె సమాధానాలలో గల అనుభవమూ, తెలివీ చూసి శతధ్వజుడు తన మెడలోని హారం తీసి ఆమె కిచ్చేశాడు.

తరవాత స్నేహితు లిద్దరూ ఇంటికి తిరిగి వెళ్ళినాక శతధ్వజుడు వజ్రనాభుడితో, "పందెం గెలిచావు. నీ రాజ్యంలో ప్రజలు తెలివి గల వాళ్ళనటానికి సందేహం లేదు. ఒక చిన్న కుటీరంలో ఉంటున్న పసిపిల్ల వాడు మొదలుకుని ముసలిదాని దాకా ఎంత తెలివిగా ప్రశ్నలకు సమాధాన మిచ్చారు!" అన్నాడు.

"వారి తెలివితేటలలో కూడా నీ వన్నట్టు తేడాలున్నాయి గనక నీవు పందెంలో ఓడి నట్టు కాదులే!" అన్నాడు వజ్రనాభుడు తృప్తిగా నవ్వుతూ.






# చింతాదేవి

"ఎవరు గొప్ప ?" అని ఒకప్పుడు శనికీ, లక్ష్మికీ, వాదం వచ్చింది. వారు శ్రీవత్స రాజును తీర్పు అడగటానికి వెళ్ళారు. "మా ఇద్దరిలో ఎవరు గొప్ప ?" అని శని శ్రీవత్సుణ్ణి అడిగాడు.

"పూజామందిరంలో మీ ఇద్దరికీ నేను వేసిన పీటలే ఆ ప్రశ్నకు సమాధానం," అన్నాడు శ్రీవత్సుడు. ఆయన శనికి వెండి పీటా, లక్ష్మికి బంగారు పీటా వేశాడు.

శనికి కోపం వచ్చి శ్రీవత్సుడి రాజభవనాన్ని దగ్ధం చేశాడు. శని ప్రభావం చేత బాహుదేవుడనే శత్రురాజు వచ్చి శ్రీవత్సుడి రాజ్యం ఆక్రమించాడు. శ్రీవత్సుడు, తన భార్య అయిన చింతాదేవితో సహా రాజ్యం వదిలి వెళ్ళిపోయాడు.

రాత్రివేళ శ్రీవత్సుడు పడుకున్న చోట, మట్టి బంగారమయింది. ఆ బంగారు మట్టితో ఇటుకలు చేసి, వాటిని ఎక్కడైనా అమ్ముదామని ఆ దంపతులిద్దరూ బయలుదేరారు. సముద్రతీరాన ఒక వర్తకుడి పడవ లంగరు దించి నిలబడి ఉన్నది. వాళ్ళు బంగారు ఇటుకలను ఆ వర్తకుడికే అమ్మాలనుకుని ఆ పడవలోకి ఎక్కారు. వర్తకుడికి చింతాదేవిని చూసీ, బంగారాన్ని చూసీ కన్ను కుట్టింది. అతను లంగరు ఎత్తించి, పడవను కదిలించాడు. అతడి భటులు శ్రీవత్సుణ్ణి సముద్రంలోకి తోసివేశారు. చింతాదేవిని ఒక కొట్టులో బంధించారు.

చింతాదేవి, పడవ నిలిచిపోవాలనీ, తన భర్త వస్తే తప్ప తానున్న గది తలుపులు తెరుచుకో రాదనీ తన పాతివ్రత్యం పైన ఒట్టేసుకున్నది.

ఈ లోపుగా, సముద్రంలో పడి పోయిన శ్రీవత్సుణ్ణి శని ఒడ్డు చేర్చాడు. అతను వెళ్ళి నగరం వెలపల ఒక దేవాలయం సమీపంలో కూర్చున్నాడు.

ఎల్. దమయంతి

ఈ సమయంలో బాహుదేవుడి కుమార్తె భద్రాదేవికి స్వయంవరం నిశ్చయించారు. ఆమె చెలికత్తెలతో సహా ఆలయానికి వచ్చి అక్కడ కూర్చుని ఉన్న శ్రీవత్సుణ్ణి వరించి, అతన్ని తప్ప మరెవరినీ పెళ్ళాడనన్నది.

శ్రీవత్సుడు తన భార్య కోసం వెతుక్కుంటూ తిరిగి సముద్ర తీరానికి వచ్చాడు. వర్తకుడు కూడా తెప్ప పడవల మీద తీరానికి వచ్చి, కనిపించిన వారినెల్లా, "బాబూ, నా పడవను కదిలించి పుణ్యం కట్టుకోండి," అని వేడుకుంటున్నాడు.

శ్రీవత్సుడు అతన్ని చూసి, "నీవు పాపివి. నన్నూ నా భార్యనూ సముద్రంలోకి తోసేసి, నా బంగారం అపహరించావు. అందుకే నీ పడవ కదల లేదు," అన్నాడు.

వర్తకుడు శ్రీవత్సుడి కాళ్ళ పై పడి, "అయ్యా, నీ భార్యను నేను సముద్రంలోకి తోయించలేదు. ఆమె ఒక కొట్టులో ఉన్నది. ఎంత ప్రయత్నించినా ఆ కొట్టు తలుపు తెరుచుకోవటం లేదు. మీరు వచ్చి నా పడవ కదిలే లాగు చెయ్యండి," అని ప్రాధేయపడ్డాడు. శ్రీవత్సుడు అతని వెంట వెళ్ళి, చింతాదేవి ఉన్న గది తలుపు మీద చెయ్యి వేసే సరికి తలుపు తెరుచుకున్నది.

వర్తకుడి పడవ కదిలింది. దాని మీదనే శ్రీవత్సుడు భార్యా సహితంగా ఒడ్డుకు చేరుకున్నాడు. ఈ లోపుగా బాహుదేవుడు, తన కుమార్తె వరించిన వాడి కోసం వెతుకుతూ సముద్ర తీరానికి వచ్చాడు. తన కుమార్తె వరించిన వాడి రాజ్యాన్నే తాను అపహరించినట్టు ఆయనకు అర్థమయింది. బాహుదేవుడు శ్రీవత్సుడికి రాజ్యాన్నీ, తన కుమార్తెనూ కూడా ఇచ్చేశాడు.

కష్టాలు పడిన మీదట సుఖం మరింత బాగా తెలిసి శ్రీవత్సుడు శనికి కూడా బంగారు పీట వేయించి, లక్ష్మీ శనులను సమానంగా పూజిస్తూ, తన ఇద్దరు భార్యలతోనూ సుఖంగా ఉన్నాడు.






ఆ కాకి ఇంద్రుడి కొడుకు, పక్షులలో మేటి, పర్వతాలలో ఉండేది, వాయు వేగం గలది. బ్రహ్మాస్త్రం వెంట పడగా ఆ కాకి మూడు లోకాలూ తిరిగింది. ఇంద్రుడు గాని, దేవతలు గాని, మహర్షులు గాని దానిని కాపాడలేకపోయారు. అది తిరిగి రాముడి వద్దకే వచ్చి శరణన్నది. రాముడు శరణాగత వత్సలుడు గనక దాన్ని క్షమించాడు; కాని బ్రహ్మాస్త్రం వృథాపోవటానికి వీలులేనందున ఆ కాకి యొక్క కుడికన్ను నాశనం చేశాడు.

సీత హనుమంతుడికి ఈ సంగతంతా చెప్పి, "ఇంత సమర్థుడై ఉండి కూడా నా భర్త నన్ను రక్షించే ప్రయత్నం చెయ్యలేదంటే నేను చేసి ఉండిన మహాపాపమే కారణమై ఉండాలి," అన్నది. హనుమంతుడామెను ఓదార్చి, రామలక్ష్మణులకూ, సుగ్రీవుడికీ, వానర సమూహానికీ ఏం చెప్పమన్నావని అడిగాడు.

"రాముడి కుశలం అడిగానని చెప్పు. ఆయనకు నా సాష్టాంగ నమస్కారం చెప్పు. నన్ను తల్లిలాగా చూసుకున్న లక్ష్మణుడి క్షేమం అడిగానని చెప్పు. అతను సమయానికి దగ్గిర ఉన్నా నన్ను రావణుడపహరించి ఉండలేడు. రాముణ్ణి బయలుదేరదీయటానికి నీకన్న సమర్థులు లేరు," అంటూ సీత తన కొంగున కట్టి ఉన్న చూడామణి తీసి హనుమంతుడికిచ్చి, "దీన్ని మా అమ్మ నాకు వివాహసమయంలో ఇచ్చింది. అప్పుడు దశరథ మహారాజు కూడా అక్కడే ఉన్నాడు. దీన్ని చూడగానే



రాముడికి మా అమ్మా, తన తండ్రీ, నేనూ జ్ఞాపకం వస్తాం,'' అన్నది.

హనుమంతు డిప్పుడు తిరిగి మామూలు రూపం ధరించి ఉన్నాడు; అతనా చూడా మణిని తీసుకుని, చేతికి తొడగటం సాధ్యం కాక, వేలికి తగిలించుకున్నాడు.

ఆ హనుమంతుడు సీతకు చెప్పవలిసిన ధైర్యమంతా చెప్పి ఆమెను విడిచి ఇవతలికి వచ్చి, రావణుడి సంగతి కొంతవరకు అంతుతేల్చుకుని పోదామని నిశ్చయించు కున్నాడు. ఇంత శ్రమపడి లంకకు వచ్చి సీతను మాత్రం చూసి తిరిగి వెళ్ళిపోవటం అతనికి భావ్యంగా తోచలేదు. రాక్షసులేపాటి పరాక్రమవంతులో, యుద్ధం చెయ్యటంలో వారికీ, వానరులకూ గల తారతమ్యం ఏమిటో తెలుసుకుని వెళ్ళితే సుగ్రీవుడి ఆజ్ఞను సరిగా నెరవేర్చినట్టవుతుందని అతనికి అనిపించింది. పనిలోపనిగా రావణుడికి కూడా వానర పరాక్రమం ఏమిటో చూపినట్టూ అవుతుంది! రావణుణ్ణి రెచ్చ గొట్టాలంటే నందన వనంలాగున్న అశోక వనాన్ని నాశనం చెయ్యటం కన్న మంచి మార్గం లేదనుకుని హనుమంతుడు తన శక్తి కొద్దీ అశోకవనంలోని చెట్లను కూలదోయ సాగాడు. క్రీడా సరోవరాలను ధ్వంసం చేశాడు. క్రీడా పర్వతాలను కూలదోశాడు. అశోకవన మంతా భీభత్సమైపోయింది. చెట్ల మీది పక్షులన్నీ భయపడి అరిచాయి. లతలూ, తీగలూ తెగి వాడు ముఖాలు వేశాయి. ఇళ్ళన్నీ కూలిపోయాయి. ఎంత మంది రాక్షసులు వచ్చినా యుద్ధం చెయ్యటానికి సిద్ధపడి హనుమంతుడు వెలపలి ద్వారం వద్ద చేరాడు.

హనుమంతుడు చేసిన విధ్వంసానికి రాక్షస స్త్రీలందరూ పరిగెత్తుకొచ్చి హనుమంతుణ్ణి చూశారు. వాళ్ళు చూస్తున్నారని తెలిసి, అసలే పెంచి ఉన్న తన శరీరాన్ని హనుమంతుడు మరింత పెంచాడు. వాళ్ళు

సీతతో, "వీడెవడు? ఎక్కడి నుంచి వచ్చాడు? ఎవరు పంపారు? నీతో ఏమిటి మాట్లాడాడు?" అని అడిగారు.

"అతనెవడో నాకేం తెలుస్తుంది? రాక్షస మాయలు మీ రాక్షసులకే తెలియాలి! అతన్ని చూస్తే నాకూ భయంగానే ఉంది. ఎవరతను? మీరే చెప్పండి," అన్నది సీత.

సీత ఇలా అనగానే రాక్షస స్త్రీలు హడలి పోయారు. వారిలో కొందరు సీతను రక్షించ టానికి ఉండిపోతే, మిగిలిన వారు రావ ణుడితో చెప్పటానికి పరిగెత్తారు. వాళ్ళు రావణుడితో, "భయంకరమైన దేహమూ, అపారమైన బలమూ కల వానరుడెవడో వచ్చి సీతతో ఏదో మాట్లాడాడు. వాడిప్పు డశోకవనంలో ఉన్నాడు. వాడెవడని అడిగితే సీత చెప్పటంలేదు. ఎవరు పంపగా వచ్చాడో గాని ఆ వానరుడు అంతఃపుర వనమంతా నాశనం చేసేశాడు. ఒక్క ప్రదేశమైనా వదిలిపెట్టలేదు. సీత కూర్చునే చెట్టు మాత్రం విరవ లేదు. సీత ఒక శింశుపా వృక్షం కిందికి వెళ్ళింది. దాన్నికూడా వాడు విరవ లేదు. అశోకవనం ధ్వంసం చేశాడు గనకా, నీవు తెచ్చిన సీతతో మాట్లాడాడు గనకా, రెండు విధాలా వాడు చంపదగిన వాడే," అన్నారు.



రావణుడీ మాటలు విని ఆగ్రహావేశం చెంది, హనుమంతుణ్ణి పట్టుకోమని తనంత పరాక్రమంగల ఎనభైవేల మంది రాక్షసు లను, కింకరులనే పేరుగల వాళ్ళను ఆజ్ఞా పించాడు. వారు వివిధాయుధాలతో బయలు దేరి వెళ్ళి, అశోకవన ద్వారం వద్ద ఉన్న హనుమంతుడి పైకి విజృంభించారు. వారు తనను చుట్టుముట్టగానే హనుమంతుడు తన తోకను నేలకేసి కొట్టి గట్టిగా అరిచాడు. ఆ ధ్వనికీ, అతను భుజాలు చరచుకున్న చప్పుడుకూ లంక అంతా మారుమోగింది.

"జయం రామలక్ష్మణులది, వానర రాజైన సుగ్రీవుడిది! నేను రాముడికి



దానితో రాక్షసులను చావ మోదాడు. ఇలా కింకరులనే రాక్షసులను మట్టుబెట్టి, ఇంకా యుద్ధకాంక్ష తీరక, హనుమంతుడు ద్వారం వద్దనే వేచి ఉన్నాడు.

ఈలోపల పారిపోయిన రాక్షసులు కొందరు రావణుడి వద్దకు వెళ్ళి, కింకరులందరూ హనుమంతుడి చేత చచ్చారని చెప్పారు. రావణుడు మండిపడి గుడ్లు తిప్పుతూ, హనుమంతుడితో యుద్ధం చెయ్యమని ప్రహస్తుడి కొడుకైన జంబుమాలి అనే వాణ్ణి, యుద్ధంలో ఓటమి ఎరగని మహా శూరుణ్ణి ఆజ్ఞాపించాడు.

కింకరులను చంపి నిలబడి ఉన్న హనుమంతుడికి అశోక వనంలోని చైత్యంలాటి భవనం జ్ఞాపకం వచ్చింది. దాన్ని అతను ధ్వంసం చెయ్యలేదు. ఆ పని చేద్దామని అతను ఒక్క ఎగురున ఆ చైత్య ప్రాసాదం మీదికి దూకాడు. ఆ ప్రాసాదాన్ని రక్షించే వారు నూరుమంది రాక్షసులు ఆయుధాలు తీసుకుని హనుమంతుడి పైకి వచ్చారు. వారి ఆయుధాలు తగిలి హనుమంతుడాగ్రహించి తన శరీరాన్ని ఇంకా పెంచాడు. అతను ఆ ప్రాసాదంలోని ఒక స్తంభాన్ని ఒక్క ఊపున పెరికి దాన్ని గిరగిరా తిప్పేసరికి, ఆ వడికి నిప్పుపుట్టి చైత్య ప్రాసాదమంతా

దాసుణ్ణి. నా పేరు హనుమంతుడు. శత్రు హంతకుణ్ణి. వెయ్యిమంది రావణులు నాకు యుద్ధంలో సాటిరారు. ఈ రాక్షసులంతా చూస్తూండగానే ఈ లంకానగరాన్ని నాశనం చేసి, సీతకు నమస్కరించి, రాముడి వద్దకు తిరిగి పోతాను," అని హనుమంతుడు గట్టిగా అరిచాడు.

ఎర్రగా పర్వతాకారుడై కనిపించే హనుమంతుణ్ణీ, అతని అరుపూ చూసి రాక్షసులు భయపడ్డారు గాని, రాజాజ్ఞ తప్పదు గనక రాక్షసు లతని పైన తమ ఆయుధాలను ప్రయోగించారు. హనుమంతుడు ద్వారం వద్దనే ఉన్న పెద్ద పరిఘను చేత బట్టుకుని,



తగలబడిపోయింది. హనుమంతుడా స్తంభంతోనే నూరుగురు రాక్షసులనూ చంపాడు.

తరవాత అతను గట్టిగా అరుస్తూ, "నా వంటి వానరులు అనేక వేల సంఖ్యలో సీతాదేవిని వెతకటానికి సుగ్రీవుడి చేత పంపబడ్డారు. లక్షల, కోట్ల వానరులతో సుగ్రీవుడిక్కడికి వస్తాడు. మీరు రాముడితో వైరం పెట్టుకున్నారు. ఇక లంక ఉండదు. నాశనమవుతుంది. మీరూ ఉండరు చస్తారు. రావణుడూ ఉండడు," అన్నాడు.

ఎర్రని పూలమాలలు ధరించి, తలలో పూలు పెట్టుకుని, కుండలాలు ధరించి, ఇంద్ర ధనుస్సులాటి విల్లూ, అందమైన బాణాలూ తీసుకుని జంబుమాలి గాడిదలు పూన్చిన రథంలో వచ్చేసరికి హనుమంతుడు ద్వారతోరణం పైన కూర్చుని ఉన్నాడు. జంబుమాలి విల్లెక్కుపెట్టి అనేక బాణాలు ప్రయోగించి హనుమంతుడి ముఖాన్నీ, దేహాన్నీ గాయపరిచాడు; హనుమంతుడు పెద్ద రాయి విసిరితే దాన్ని బాణాలతో పడగొట్టాడు; సాలవృక్షం పీకితే దాన్ని ముక్కలు ముక్కలు చేశాడు. చివరకు హనుమంతుడు మొదట తీసుకున్న పరిఘనే తీసి గిరగిరా తిప్పి విసిరే సరికి జంబుమాలితో బాటు రథమూ, గాడిదలూ నజ్జునజ్జయిపోయాయి.



కింకరులతో బాటు జంబుమాలి కూడా చచ్చాడని విని రావణుడు ఆగ్రహావేశం చెంది, అస్త్రవేత్తలయిన ఏడుగురు మంత్రి పుత్రులను హనుమంతుడి పైకి పంపాడు. వారు తమతమ సైన్యాలను వెంటబెట్టుకుని, ఎవరు ముందు వెళ్ళి శత్రువుతో తలపడతారా అని పోటీలు పడుతూ, అమితోత్సాహంతో బయలుదేరారు. వాళ్ళు తన మీద వదిలిన బాణవర్షాన్ని తప్పించుకుని హనుమంతుడు గాలిలోనే సంచరిస్తూ, రాక్షసమూకను చేతులతోనూ, కాళ్ళతోనూ కొట్టి చంపాడు. వారు పెట్టిన చావు కేకలకు లంక యావత్తూ పిక్కటిల్లింది.





మంత్రి పుత్రులు కూడా ఎప్పుడైతే చచ్చారో, రావణుడికి భయం ఆరంభ మయింది. కాని అతను దాన్ని లోపలనే అణచుకుని, విరూపాక్షుడూ, యూపాక్షుడూ, దుర్ధరుడూ, ప్రఘసుడూ, భాసకర్ణుడూ అనే అయిదుగురు అగ్రసేనానాయకులను పిలిచి, "సేనాధిపతులారా, మీరు చతురంగ బలాలతో వెళ్ళి ఆ వానరుణ్ణి శిక్షించండి. వాడు వానరుడుగా నాకు తోచలేదు. ఏ ఇంద్రుడో తపస్సు చేసి ఈ భూతాన్ని మన పైకి పంపాడేమో! నేను కూడా మహా బలవంతులైన వానరులను, వాలి సుగ్రీవ నీల ద్వివిదాదులను చూశాను గాని, వారి కన్న ఈ వానరుడు మిన్నగా కనబడతాడు. ఇదేదో వానర రూపంలో ఉన్న భూతం. ప్రయాసపడి ఎలాగైనా ఈ వానరుణ్ణి మీరు పట్టాలి. యుద్ధం చేసేటప్పు డేమాత్రమూ అశ్రద్ధగా ఉండకండి," అని హెచ్చరించాడు.

ఆ అయిదుగురూ బయలుదేరి అశోకవన ద్వారం దగ్గిరికి వెళ్ళి హనుమంతుణ్ణి చూసి, అతన్ని అన్నివైపుల నుంచీ చుట్టుముట్టి యుద్ధం ఆరంభించారు. దుర్ధరుడు హనుమంతుడి తలను అయిదు బాణాలతో కొట్టాడు. హనుమంతు డొక్క పెడబొబ్బ పెట్టి ఆకాశంలోకి ఎగిరాడు. అక్కడినుంచి అతను అతి వేగంగా, సూటిగా దుర్ధరుడి రథం పైకి దూకే సరికి, ఆ పాటుకు రథమూ, దానికి కట్టిన ఎనిమిది గుర్రాలూ, అందులో వున్న దుర్ధరుడూ క్షణంలో నాశనమయారు.

దుర్ధరుడు చచ్చేసరికి విరూపాక్ష యూపాక్షులు ఆగ్రహం చెంది ఆకాశానికి ఎగిరి, ముద్గరాలతో హనుమంతుణ్ణి రొమ్ము మీద కొట్టారు. హనుమంతు డొక మద్దిచెట్టు పెరికి, దాంతో వారిద్దరినీ చావ మోదాడు. ముగ్గురు చావగా మిగిలిన ఇద్దరూ అడ్డకత్తి, శూలమూ తీసుకుని హనుమంతుడిపై కలియబడి, అతన్ని గాయపరిచారు. హనుమంతు డొక పర్వత శిఖరాన్ని, దానిపై గల

వృక్షాలతోనూ, జంతువులతోనూ సహా విరిచి, దాన్ని ఎత్తి ప్రఘసుడి పైనా, భాసకర్ణుడి పైనా కొట్టి, వారిని కూడా చంపాడు.

ఇలా అయిదుగురు యోధులనూ చంపి హనుమంతుడు వారి సేనలను అవలీలగా నిర్మూలించాడు.

ఈ వార్తకూడా తెలియరాగానే రావణుడి కన్ను యుద్ధోద్రిక్తుడై ఉన్న తన కొడుకు అక్షుడి పైన పడింది. తండ్రి తన కేసి చూడటమే ఆలస్యంగా అక్షుడు చివాలున లేచి, బంగారం పొదిగిన తన విల్లు తీసుకుని, బంగారు అలంకరణలు గల తన గొప్ప రథ మెక్కి హనుమంతుడి పైకి వెళ్ళాడు. ఆ రథం నిండా ఆయుధాలున్నాయి. అది యుద్ధానికి ఆయత్తం చేయబడి ఉన్న రథం. అతని వెంట సైన్యం కూడా వెళ్ళింది.

హనుమంతు డింకా అశోకవన ద్వారం వద్దనే ఉన్నాడు. అతన్ని చూస్తూనే అక్షుడు తన శత్రువు పరాక్రమవంతుడని గ్రహించి గౌరవభావంతో చూశాడు. ఇద్దరికీ గొప్ప యుద్ధం జరిగింది. అక్షుడు కుర్రవాడైనా అతని పరాక్రమం చూసి హనుమంతుడు కూడా సంతోషించాడు. అతను అక్షుడి బాణాలకు అందకుండా తప్పుకుంటూ గాలిలో తిరుగుతూ, "ఈ కుర్రవాణ్ణి ఎలా చంపడం? అయినా వీ డిప్పుడే ఇంత ప్రతాపం చూపుతున్నాడే, ముందుముందింకా ఎంత ప్రబలుడవుతాడో! ఇప్పుడే వీణ్ణి చంపటం మంచిది," అనుకున్నాడు.

అక్షకుమారుడి రథం ఆకాశంలో కూడా సంచరించగలది. అది ఆకాశంలో ఉండగానే హనుమంతుడు ఆ రథానికి గల గుర్రాలను చేత్తో కొట్టి చంపి, చక్రాలు విరిచాడు. రథం నేల కూలింది, కాని అక్షుడు విల్లుతో రివ్వున ఆకాశంలోకి లేచాడు. అలా లేచిన అక్షుడి కాళ్ళు రెండూ ఉపాయంగా పట్టుకుని, హనుమంతుడు అతన్ని గాలిలో గిరగిరా తిప్పి, బలంగా నేల కేసి కొట్టి చంపేశాడు.





# వైద్యసహాయం

ఒకనాడు పాపన్న ఏదో పని మీద వీధి వెంబడి పోతూండగా, ఒక ఇంటి ముందు నిలబడి వున్న చిన్న పిల్ల, "అయ్యా, ఒక చిన్న సహాయం చేస్తారా?" అని అడిగింది.

"తప్పకుండా చేస్తానమ్మా! ఏం కావాలి!" అని పరోపకారి పాపన్న ఆ పిల్లను అడిగాడు.

అరుగు మీద ఆ పిల్ల తల్లి పడుకుని ఉన్నది. ఆమెకు జ్వరం. కాళ్ళు నిస్సత్తువగా వుండటం చేత, లేచి లోపలికి వెళ్ళలేని స్థితిలో వుంది. ఎవరైనా సహాయం పట్టి ఆమెను లోపలికి చేర్చాలి.

పాపన్న జబ్బు మనిషిని మెల్లిగా లేవదీసి, లోపలికి తీసుకుపోయి, పక్క మీద పడుకోబెట్టి, "జబ్బుకు మందు తీసుకుంటున్నారా?" అని అడిగాడు.

"లేదు, నాయనా. మాబోటి వాళ్ళం మందులూ, మాకులూ ఎక్కడ కొనగలం? మందు లేకుండానే, జబ్బు దానంతట అది నయం కావాలిసిందే," అన్నది జబ్బుమనిషి.

"మీ నాన్నగా రేరమ్మా?" అని పాపన్న చిన్నపిల్ల నడిగాడు.

"మా నాన్న బస్తీలో వుంటాడు. వారానికొకసారి వస్తాడు," అన్నది పిల్ల.

"జబ్బుకు మందు లేకపోతే ఎలాగ?" అంటూ పాపన్న అక్కడి నుంచి వైద్యుడి ఇంటికి బయలుదేరి వెళ్ళాడు. ఆ గ్రామానికి ఆయన ఒకడే వైద్యుడు. వైద్యుడింటి తలుపు మూసివున్నది. పాపన్న తలుపు తట్టిన మీదట కుర్రవాడొకడు తలుపు తెరిచి, "ఏం కావాలి?" అని అడిగాడు.

"వైద్యుడుగారు—" అని పాపన్న అంటూండగానే ఆ కుర్రవాడు చెయ్యి ముందుకు చాచాడు.

ఆ అభినయం అర్థంకాక పాపన్న, "ఏం కావాలి?" అని అడిగాడు.



"మీకు తెలీదా? వైద్యుడుగారిని చూడాలంటే నా చేతిలో ఒక పావలా పెట్టాలి. ఆయనతో మాట్లాడాలంటే మరో పావలా ఇవ్వాలి. మందు కూడా కావాలంటే మరి రెండు పావలాలు!" అన్నాడా కుర్రవాడు.

పాపన్న కుర్రవాడి చేతిలో ఒక పావలా పెట్టి లోపలికి ప్రవేశించాడు. అతన్ని చూడగానే వైద్యుడు చెయ్యిచాచాడు. పాపన్న ఆయన చేతిలో ఇంకో పావలా పెట్టాడు. పాపన్న చెప్పినదంతా విని వైద్యుడు, "నేను వచ్చి రోగిని చూడాలంటే ఎనిమిది పావలాలు ఇవ్వవలిసి వుంటుంది," అన్నాడు. వైద్యుడికి రెండు రూపాయ లిచ్చి, పాపన్న ఆయనను వెంటబెట్టుకుని జబ్బు మనిషి దగ్గిరికి తీసుకువచ్చాడు.

వైద్యుడు రోగిని పరీక్షించి, ఆమెకు ఏదో భస్మమూ, కషాయపు దినుసులూ, పైపూత ఇచ్చి, వాటి కన్నిటికీ డబ్బు పుచ్చుకుని, పథ్యపానాలు చెప్పి వెళ్ళిపోయాడు.

జబ్బుమనిషి పాపన్నతో, "జబ్బు నయం కాక అలాగే వుంటుందా, నాయనా? డబ్బుగల వాళ్ళు తప్ప ఈ వైద్యుణ్ణి భరించ లేరు. ఆ సంగతి ఊళ్ళో అందరికీ తెలుసు. ఎందుకు వృధాగా డబ్బు ఖర్చు చేసుకుంటావు?" అన్నది.

"అదేమిటమ్మా? జబ్బుకు మందుపడి తీరాలి. అయే ఖర్చేదో నే నిచ్చుకుంటానులే," అని పాపన్న తాను దగ్గిరే ఉండి కషాయం తయారు చేయించి, రోగి చేత తాగించి, ఆ పని పూర్తి అయినాక తన ఇంటికి వెళ్ళిపోయాడు.

తరవాత పాపన్న తన భార్య మీనాక్షిని తీసుకు వచ్చి రోగికి శుశ్రూష చెయ్యటానికి ఏర్పాటుచేశాడు. మళ్ళీ రెండుసార్లు వచ్చి రోగిని చూసిన వైద్యుడు, పాపన్నా, అతని భార్యా రోగిని గురించి తీసుకునే శ్రద్ధచూసి, "నీకూ ఈ రోగికీ ఏమిటి సంబంధం?" అని అడిగాడు.

"అవిడా మనిషి, నేనూ మనిషిని. అంతకు మించి సంబంధ మేమీలేదు," అన్నాడు పాపన్న.

పాపన్నా, అతని భార్యా అమాయకులనీ, వాళ్ళు ఊళ్ళో వాళ్ళ కోసం తమ డబ్బంతా ఇలాగే తగలేసు కుంటారనీ వైద్యుడు అనుకున్నాడు.

నాలుగు రోజులలో రోగికి వ్యాధి నిమ్మళించింది. ఈ సంగతి చెప్పి, పథ్యం మార్పులేమైనా వుంటే తెలుసుకుందామని పాపన్న వైద్యుడి ఇంటికి వెళ్ళాడు.

వైద్యుడు తన ఇంటి వద్ద విచారంగా కూర్చుని వున్నాడు. "ఏమండీ, అలా దిగులుగా ఉన్నారు?" అని పాపన్న ఆయన నడిగాడు.

"ఈ వూరి వాళ్ళంతా వట్టి పాపిష్ఠివాళ్ళు! చిన్నమెత్తు సహాయం చెయ్యరు–మందుకు మాత్రం వస్తారు!" అన్నాడు వైద్యుడు.

"ఏం సహాయం కావాలో చెప్పండి, నేను చేస్తాను," అన్నాడు పాపన్న.

"నీవేం సహాయం చేస్తావు? ఆవును మోసుకుపోవాలి! మోస్తావా?" అని అడిగాడు వైద్యుడు.

"సాధ్యమైతే మోస్తాను. అసలు సంగతేమిటి? ఆవు ఎక్కడున్నది?" అంటూ పాపన్న పై బట్ట తీసి నడుముకు బిగించాడు.



జరిగినదేమంటే, వైద్యుడి ఆవు ఇంటి పక్కన గడ్డి మేస్తూ, పక్కనవున్న పల్లంలో పడిపోయింది. ముందు కాళ్ళకు బాగా దెబ్బ తలిగింది. దాన్ని పక్క గ్రామంలో ఉండే పశువుల వైద్యుడి దగ్గిరికి చేర్చాలి. అది లేచి నిలబడలేదు గనక దాన్ని ఎవరన్నా మోసుకుపోవాలి.

ఆవును మొయ్యటానికి రమ్మని వైద్యుడు ఊళ్లో వాళ్లను పిలిచాడు. డబ్బిస్తానన్నా కూడా ఒక్కరూ రాలేదు.

ఈ విషయమంతా విని పాపన్న వైద్యుడితో, "ఆవును మోసుకుపోయే పని నేను చూస్తాను, మీరేమీ విచారపడకండి," అని చెప్పి, తన భార్య మీనాక్షిని పిలుచుకు వచ్చాడు. ఆవును వెదురుగడల చట్రంపైన పడుకోబెట్టి, దాన్ని పాపన్నా, మీనాక్షీ కలిసి ఎత్త ప్రయత్నించారు.

"మీరు కూడా ఒక చెయ్యి వెయ్యండి," అన్నాడు పాపన్న.

"నేనా!" అని వైద్యుడు దిక్కులు చూశాడు, కాని సహాయం వెళ్ళలేదు. పాపన్నా, మీనాక్షీ కలిసి అమిత ప్రయాసతో ఎలాగో ఆవును పశువుల పాక నుంచి బయటికి తెచ్చారు.

బయట కొందరు నిలబడి జరిగేదంతా చూస్తున్నారు. వారిప్పుడు ముందుకు వచ్చి, "పాపన్నగారూ, మీ రుండండి. మీ బదులు మేమే మోస్తాం. ఈ వైద్యుడుగారి కోసమూ, ఆయన ఇచ్చే డబ్బు కోసమూ అయితే మొయ్యంగాని, మీరు శ్రమ పడుతుంటే చూస్తూ ఊరుకుంటామా?" అన్నారు.

వాళ్ళు ఆవును పొరుగూరు పట్టుకుపోయి పశువుల వైద్యుడి చేత దానికి చికిత్స చేయించి మళ్ళీ తీసుకువచ్చారు.

వైద్యుడు వారికి డబ్బివ్వబోయాడు, కాని వారు తీసుకోక, "అయ్యా, డబ్బే ప్రధానం కాదు. ఊరి కింత ఉపకారం చెయ్యటం నేర్చుకోండి! అంతేచాలు!" అన్నారు.



ప్రపంచపు వింతలు:

# 28. రాక్షసి "కేక్టస్"

నిర్జలమైన ఎడారిలో 60 అడుగుల ఎత్తు సైతం పెరిగే ఈ రాక్షసి "కేక్టస్" మొక్కలు సృష్టివైచిత్రికి మంచి తార్కాణం. మెక్సికోలోని ఒక ఎడారి ప్రాంతం (దిగువ కాలిఫోర్నియాలో) ఈ చెట్లు పెరుగుతాయి. మెక్సికనులు వీటిని దూలాలుగా ఉపయోగిస్తారు. ఇందులో పక్షులు గూళ్ళు కట్టుకుంటాయి.



Photo by Ravinder Kumar Paul



బహుమతి
పొందిన వ్యాఖ్య

పాపకు కండెతో పోరాటం

పంపినవారు :
ఎస్. ధనంజయరాం, తెనాలి

Photo by C. P. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

కొంగకు ఆకలి ఆరాటం

పంపినవారు:
ఎస్. ధనంజయరాం, తెనాలి

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1964 మే నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మార్చి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలించబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫొటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫొటో : పాపకు కండెతో పోరాటం

రెండవ ఫొటో : కొంగకు ఆకలి ఆరాటం

పంపినవారు : ఎస్. ధనంజయరాం,

తెనాలి (గుంటూరు జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

రాగిణి ఎక్కడవున్నా అక్కడ ఆనందము, నవ్వులు, కళ ఉంటాయి...

రాగిణి ఎక్కడవున్నా అక్కడ న్యూట్రిన్ స్వీట్స్ ఉంటాయి...



అందాల రాగిణి అన్నది: "అన్నింటిలో అతిశ్రేష్ఠమైనవి నేను కోరుతాను. అందుచే టాఫీలలో, పెప్పరమిట్లలో, నేను ఎప్పుడూ న్యూట్రిన్ కొంటాను. అన్ని రకాలలో న్యూట్రిన్ ఉన్నతము".

మీ మధురానందముకొరకు న్యూట్రిన్





న్యూట్రిన్ కన్ఫెక్షనెరీ కంపెనీ
ప్రైవేట్ లిమిటెడ్
చిత్తూరు (ఆం. ప్ర.)

# అన్నివంటలకు శ్రేష్ఠమైన నూనెలు




అగ్‌మార్కు కాబడిన ఎ.యస్. బ్రాండ్ చాయపప్పు నూనె




అగ్‌మార్కు కాబడిన మేన్షన్ బ్రాండ్...... నువ్వులనూనె

- గోదావరిడెల్టా నువ్వులనుండి ఆరోగ్యకరమగు ప్రత్యేకపద్ధతులతో తయారుకాబడినవి.
- రుచి,రంగు,సువాసనలతో అన్నివంటపదార్థములను అమితమగురుచివంతముగ చేయును.
- ఊరగాయలను చాలకాలము నిలువయుంచును. ముక్కను మెత్తబడనీయవు, బూజుపట్టనీయవు.
- తలకువాడినయెడల మెదడుకు చలువ చేయును. వెంట్రుకలను బాగుగా పెరుగునట్లు చేయును.
- 16,4,2. కి.గ్రా. డబ్బాలలో పేకింగు చేయబడుచున్నవి.

మద్రాసు డిస్ట్రిబ్యూటర్సు:

M/s. పెరుమాళ్ళు & కో.
137, ఆదియప్పనాయక్ స్ట్రీట్
మద్రాసు-1 ఫోన్ నెం: 23095

M/s: B. వెంకటేశ్వరరావు & కో.
136, పురసువాక్కం హైరోడ్
మద్రాసు-7 ఫోన్ నెం: 61552 & 62574

MFRS, అంబటిసుబ్బన్న&కో. సామర్లకోట

ASP/GM/K-2L TEL

# అహో ... కోలినోస్

Kolynos

## హాయినిగొలిపే స్వచ్ఛమైనది...

కోలినోస రుచి!
నాలుక ఝల్లుమనే ఆహ్లాదం
కోలినోస నురుగు!
తోముకొనుట తేలికచేయును, పూర్తిగా శుభ్రపరచును
కోలినోస యిచ్చే సుగంధ శ్వాస!
మీకు, యితరులకు ఎంతో యిష్టం

ఆ ఐదో ఆయనకు ఒక్క కిటుకు!
కోలినోస్ డెంటల్ క్రీమ్ వాడి, ఒక్కసారి
చిరునవ్వు...అందరిలాగే! కోలినోస్‌తో
శుభ్రంగా, హాయిగా వుండండి—ఉదయము,
రాత్రి. ఈ సహవాసంలో అధిక
విశ్వాసము...అధిక ఉల్లాసము.



## మధురమైన చిరునవ్వులు... కోలినోస్ చిరునవ్వులు

రిజిష్టర్డ్ యూజర్: జెఫ్రీమేనర్స్ అండ్ కంపెని లి.



## కేశవర్ధిని

వాడితే నిడుపాటి నిగనిగ లాడే కేశములు పెరుగును. జీవరహితమైన శిరోజాలకు క్రొత్త అందము వచ్చును. చక్కటి సువాసన గల కేశవర్ధినితో ఆరోగ్యవంతమైన కురులను సృష్టించుకోండి.

### కేశవర్ధిని రెడీ మిక్స్‌డ్ హెయిర్ ఆయిల్

ఇప్పుడు క్రొత్తగా ప్రవేశపెట్టబడినది.

ఎన్నెన్నో సుగుణాలు గల కేశవర్ధిని షాంపూను ప్రతి ఆదివారం తప్పక వాడుట నియమంగా పెట్టుకొనండి.

తయారుచేయువారు: **కేశవర్ధిని ప్రాడక్ట్స్,**
9/40, వీరబోయన్ కాలొనీ, జైల్ రోడ్, కోయంబత్తూరు-1

## మీ ఉపాహార, భోజనం కుతూహలముగా నుండుటకు

## శుద్ధమైన కాఫీ

# స్టేన్స్






ది యునైటెడ్ కాఫీ సప్లై కంపెనీ లి.,
తపాలు పెట్టె నం. 12, కోయంబత్తూరు.

డిపోలు: 40, సౌత్ మాడాస్ట్రీట్, మైలాపూర్.
మెసర్స్. సేవాయ్, 154, పురశువాకం హైరోడ్, వెపేరి, మద్రాస్-7.

BI/DI-10 TEL

# మా కుటుంబము ఆడుతూ పాడుతూ వుంటుంది...



# ధూత్‌పాపేశ్వర్ ఔషధముల

## సహాయముతో నా కుటుంబము స్వస్థతగా నుండును.

**అభ్రలోహ:** పాలిపోవుట, క్షీణించుట, ప్రసవానంతరము కలుగు అన్ని బాధలను పోగొట్టుటకు సహాయపడును. తల్లులకు పాలను అధికము చేయుటకు కూడా సహాయపడును. ఇది జీర్ణశక్తిని పెంపొందించే టానిక్.

**స్వామలా:** ఇది ఉత్తమమైన మరియు ప్రభావమైన టానిక్. ఇది శారీరకమైన మరియు నరముల దుర్బలత్వమును దూరము చేసి శక్తి నిచ్చును.

**బ్రాహ్మీ ఆమ్లా హెయిర్ ఆయిల్:** తల వెంట్రుకలను, మెదడును మరియు చర్మమును ఆరోగ్యముగా నుంచును. మానసిక అలసటను తగ్గించుటకు కూడా చాలా ఉపయోగపడును.



ధూత్‌పాపేశ్వర్
ఇండస్ట్రీస్ లిమిటెడ్., పన్వేల్
బొంబాయి

*91 సంవత్సరముల నుండి ఆయుర్వేద ఔషధములను తయారు చేయుటలో అగ్రగణ్యులు!*

బ్రాంచి : సుల్తాన్ బజార్, హైదరాబాద్,

డిస్ట్రిబ్యూటర్లు : మెసర్స్ జైన్ మెడికల్ స్టోర్స్, ఆదోని,
పద్మ ఏజన్సీస్, గుంటూరు.



ప్రప్రథమంగా
N.T.రామారావు
ద్విపాత్రాభినయం
సురేష్ ప్రొడక్షన్స్
VIJAYA PUBLICITY
రాముడు-భీముడు
దర్శకత్వం
చాణక్య
నిర్మాత
D.రామానాయుడు
అసోసియేట్ ప్రొడ్యూసర్
జె.సుబ్బారావు..
విజయ రిలీజ్





హార్లిక్స్ చేసే మంచికి ఒక ఉదాహరణ :






నా మనస్సు చివుక్కుమంది. క్రొత్త కంపెనీలో పై పదవి మందముగా వస్తుంది కనుక నేను ప్రమోషనుమీద బదిలీ త్వరగా అవుతుందని ఆశించేను. ఇంక బదిలీ లేదని నా భార్యతో అంటే ఆమె చాల నిరుత్సాహపడి సాధింపు ప్రారంభించింది. "బాగుంది మీ వరస! ఆఫీసులో సాధింపు చాలదనా మీ ఉద్దేశం" అన్నాను. ఆమె యిలా అంది. "బదిలీని గురించి నేను అనడములేదు. మిమ్మల్ని గురించే విచారిస్తున్నాను. ఈ మధ్య మీరు నీరసముగా, ఏదో ఆలోచిస్తూన్నట్లున్నారు. ఒకసారి డాక్టరు దగ్గరకు వెళ్లండి!"



ఆమె చెప్పిన విషయమూ సబబుగానే ఉంది. పోనీ, అలాగే చేద్దామని మర్నాడు డాక్టరు దగ్గరకు వెళ్లేను. ఆయన యిలా అన్నారు. "కష్టపడి పనిచేస్తున్నారేమో, మీకు ఎక్కువ పోషణ కావాలి. రోజూ హార్లిక్స్ త్రాగండి, చురుకుగా ఉంటారు."



హార్లిక్స్ ఎంత బాగుగా పనిచేసింది! గోధుమపిండి మరియు మాల్టెడ్ బార్లీల పోషణతో కూడిన శ్రేష్ఠమైన డెయిరీ పాలతో తయారైన హార్లిక్స్ నాకు ఎక్కువ శక్తి ఉత్సాహములను కలిగించింది. ఆఫీసులో నా పనిని మెచ్చుకొని నన్ను ప్రమోషనుమీద మా వూరు బదిలీచేసేరు. హార్లిక్స్ చేసిన మేలు మేము ఎన్నటికీ మరచిపోలేము!




**హార్లిక్స్ అదనపు శక్తిని కలిగించును!**

JWT HL 4823-a

# అమూల్ పాల ఆహారమందున్న
# ఏడు విటమినుల ప్రభావం



**విటమిను ఎ**

చర్మమును సున్నితంగా కళ్లను ప్రకాశవంతంగావుంచి పెరుగుదలను వృద్ధి చేయును.



**విటమిను బి 1**

నరాలను బలపరచి, హృదయ కండరాలను సమంగా వుంచును.

**విటమిను బి 2**

నోరును ఆరోగ్యవంతంగా వుంచును.





**విటమిను బి 6**

కండరాలను సడలించును.



**విటమిను సి**

అంటురోగాలను నివారించి శీతాదనమును నిరోధించును.



**విటమిను డి**

బలమైన ఎముకలను, ఆరోగ్యమైన పండ్లనువుంచి పిల్లల రోగాలను నివారించును.



**నయాసినమైడ్**

జీర్ణవృద్ధి, బలమైన నరాలను పెంపొందించి చర్మమును శుభ్రంగా వుంచును.

అమూల్ పాల ఆహారములో యీ 7 విటమినులేగాక, మాంస కృత్తులు, కార్బోహైడ్రేటులు, క్రొవ్వు, కాల్సియం, భాస్వరం సమ పాళ్లలో వున్నవి. అమూల్ ప్రశస్తమైన ఆహార విలువలే ఆధునిక తల్లులకు మన్నిక. మీ బిడ్డకు ఎంతో మంచిది.

**అమూల్** పాల ఆహారంలో మీ బిడ్డకు వలసిన 7 విటమినులు కలవు.





WITH AN EXPERIENCE OF
OVER 30 YEARS

THE

# B. N. K. PRESS

**PRIVATE LIMITED,**

"CHANDAMAMA BUILDINGS"

MADRAS-26 (PHONE: 41851-4 LINES)

***OFFER***
***BEST***
***SERVICES***

IN

**COLOURFUL PRINTING &**
**NEAT BLOCK MAKING**

*

*FAMOUS FOR PRECISION*
AND PROMPTITUDE

